ఓమ్

## కుటుంబ జీవన విధానం

# కుటుంబంలో ఎవరెవరితో ఎలా మెలగాలి?

## పాలగిరి వారి 'పెళ్ళి కానుక'



రచన - కూర్పు


వాచస్పతి, విద్యావారిధి

సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద

వేదాచార్య **డా॥ మట్టి కృష్ణారెడ్డి**

M.A., M.Ed., Ph.D., D.Lit.

శ్రీమతి & శ్రీ గూడూరు సుధీర - రాజగోపాల్ రెడ్డి గార్ల

పుత్రుడు చి॥ శివ ప్రతీక్

శ్రీమతి & శ్రీ సరళాదేవి - పాలగిరి సహదేవరెడ్డి గార్ల

పుత్రిక చి॥ ల॥ సౌ॥ విజయలక్ష్మి (అనూష)

**వివాహ సమయం:**
13-06-2019
గురువారం రాత్రి గం॥ 9.52 ని॥లకు

**వివాహ వేదిక:**
జె.ఆర్.సి. కన్వెన్షన్ సెంటర్
విష్‌పర్ వ్యాలీ ప్రక్కన,
ఫిలింనగర్, హైదరాబాద్

# కుటుంబంలో ఎవరెవరితో ఎలా మెలగాలి?

(కలహాలు లేని కుటుంబ జీవన విధానము)

ఇంటింటా ఉండవలసినది, ప్రతి ఒక్కరూ చదువ వలసినది.



రచన - కూర్పు

వాచస్పతి, సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోదవేదాచార్య

డా॥ మట్టి కృష్ణారెడ్డి ఆర్య, M.A., M.Ed., Ph.D., D.Lit.

2019

## విషయ సూచిక



# కుటుంబంలో ఎవరెవరితో ఎలా మెలగాలి?

**సూచన:** ఇందులో పెద్దలపట్ల పిన్నలు, పిన్నలపట్ల పెద్దలు ఎలా మెలగాలి? ఒకరినొకరు ఎలా గౌరవించుకోవాలి? చిన్న చిన్న అభిప్రాయభేదాలు కలహాలు వచ్చినప్పుడు తమ తమ యోగ్యతలను బట్టి ఎలా ఓదార్చుకోవాలి? సఖ్యతనెలా పెంచుకోవాలి? పెంపొందింపజేయాలి? అను మొదలగు అంశాలను నా శక్తి కొలది వివరించుటకు ప్రయత్నించాను. సమయానుకూలంగా అనుభవంగల పెద్దలు ప్రేమ ప్రవృత్తిని, కలహనివృత్తిని గూర్చి బాగా వివరించి సమిష్టి భారతీయజీవన విధానాన్ని వృద్ధి చేయగలరని ఆశిస్తున్నాను.

– గ్రంథ నిర్మాణకర్త

### 1. ప్రశ్న: వివాహం ఎందుకు చేసుకోవాలి? అది అవసరమా?

**జవాబు:** ఈ ప్రశ్నకు సమాధానం వేదోద్ధారకులు ఆర్యసమాజ సంస్థాపరకులు మహర్షి దయానంద సరస్వతిగారు తమ గ్రంథాలలో ఈ విధంగా వ్రాశారు. శూరులు, ధీరులు, ఉదారచరితులు, ధర్మాత్ములు, ఆరోగ్యవంతులు, జ్ఞాన సంపన్నులు, జితేంద్రియులగు ఉత్తమ సంతానమును పుట్టించి ప్రపంచమును ముందుకు సాగించుటకే వివాహం చేసుకోవాలి. వివాహం చేసుకొనలేకపోతే గృహస్థాశ్రమం లేకుండా పోతుంది. గృహస్థాశ్రమమే లేనినాడు బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్యాసాశ్రమాలు ఎక్కడుండును? గృహస్థాశ్రమమునుండే కదా మానవులందరూ పుట్టేది? సృష్ట్యారంభమునుండి నేటివరకు ఈ భూలోకములో పుట్టిన అవతార పురుషులు, లోకోద్ధారకులు, ప్రవక్తలు, యోగులు, రాజయోగులు, కర్మశూరులు, ధైర్యశాలురు మొదలగువారందరు గృహస్థాశ్రమములో తల్లిదండ్రులకు పుట్టినవారే కదా! ఇక భవిష్యత్తులో కూడా సత్సంతానము గృహస్థాశ్రమము నుండియే పుట్టవలసి యున్నది. కావున ప్రతి మానవుడు బ్రహ్మచర్యాశ్రమమును (25 సం॥ల వరకు) చక్కగా పాలించి విద్యాది సద్గుణములతో భూషితుడై గృహస్థాశ్రమాన్ని స్వీకరించి ఋతువానుకూలముగా స్వపత్నితో చరించినప్పుడే ఉత్తమ సంతానం కలుగుతుంది. ఉత్తమ సంతానం కొరకే వివాహం. విచ్చలవిడిగా కామవాంఛలను తీర్చుకొనుటకు కాదు. నేటి మానవులు సదాచారులు ఎందుకు కాలేకపోతున్నారు? సత్యం ధర్మం న్యాయం పట్ల ఎందుకు శ్రద్ధ చూపలేకపోతున్నారు? ఈ ప్రశ్నలకు సమాధానం "బాలురకు పుణ్య సంస్కారము లేనందువలననే. కావుననే పుణ్యాశ్రమమైన బ్రహ్మచర్యాశ్రమమునందు నిలువలేకపోవుట, ఉత్కృష్టమైన విద్యనభ్యసించక పోవుట, సత్య ధర్మాలను ఆదరించకపోవుట, దైవమునందు విశ్వాసము లేకపోవుట జరుగుచున్నది. పుణ్య సంస్కారమానవులను పుట్టించుటకు ఒకే ఒక మార్గం గృహస్థాశ్రమం. దీనికి పుణ్యాత్ములగు తల్లిదండ్రులు కావలయును".

"ఉత్తమ సంతానము కలుగవలయుననిన మాతా పితరులును ఉత్తమ సంస్కారము గలవారై, దైవనిష్ఠ గలవారై, కరుణార్ద్ర హృదయులై ఉండవలెను. ఈ దివ్యజ్ఞానాన్ని పొందుటకు కొన్ని పుణ్యజీవులు జన్మించుటకు ఉత్సాహకులైయున్నారు. శ్రేష్ఠమగు గర్భమునందే వారు జన్మింతురు. కావున లోకోద్ధారకులై దైవజ్ఞానసంపన్నులైన సంతానమును కోరు ప్రతి మాతాపితరులు పుణ్యప్రవర్తన కలిగియుండవలయును".

ప్రతి కుల, మత, జాతులలో కూడా వివాహం పవిత్రమైనదిగా భావిస్తారు. తమ తమ ఆచారాలతో వివాహం జరిపిస్తారు. అట్లుగాక వివాహాది కార్యములన్నీ శాస్త్రోక్తంగా – 'అగ్నిహెూత్రం, వేదమంత్ర పఠనం, బ్రహ్మనిష్ఠుల ఆశీర్వాదం' అనువాటితో వివాహం జరుగుట మంచిది. అట్లుగాక స్వేచ్ఛావిహార వివాహము అంతమంచిది కాదు. వైదిక ప్రకారము చేసిన వివాహమునందే ఉత్తమ సంతానము కలుగును. అగ్నిసాక్షిగా, వేదమంత్రములతో బ్రహ్మనిష్ఠుల ఆశీర్వాదములతో దైవసాక్షిగ జరిగిన వివాహబంధమును అతిక్రమించకూడదనే గాఢమగు భావబంధము కలిగియుండును. లేనిచో ఇష్టము వచ్చినట్లు వదిలి వెళ్ళిపోవుట జరుగును. కావుననే ప్రతి మతమువారు వివాహధర్మమును ఏర్పాటు చేసుకొన్నారు. సతికి ఎన్ని పాతివ్రత్య ధర్మములు శాస్త్రమున చెప్పబడినవో పతికి కూడ సతియందు అట్లే ఏకపత్నీవ్రత ధర్మములు చెప్పబడినవి. కాబట్టి శాస్త్రాలలో భార్యను అర్ధాంగి అని అన్నారు. కావున తన శరీరాంగములకు బాధ కలుగకుండ ఎట్లు చూసుకొనునో భార్యను కూడా అట్లు చూసుకోవాలి. భార్య కూడ భర్తను అట్లే చూసుకోవాలి.

**2. ప్రశ్న : గృహస్థుని ముఖ్య ధర్మమేమిటి?**

**జవాబు:** తన సంతానమును, తల్లిదండ్రులను పోషిస్తూ, బ్రహ్మచారులను, వానప్రస్థులను, సన్న్యాసులను కూడా పోషించడం గృహస్థుని ముఖ్య ధర్మం. నదులు సముద్రాన్ని చేరినట్లుగా బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్యాసాశ్రమవాసులు తమ అన్నపాన వస్త్రాదుల కొరకు గృహస్థుని చేరుదురు. అతడే వారందరికి తల్లి, తండ్రి, పాలకుడు, సంరక్షకుడు. గృహస్థుని వలననే కదా బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, సన్న్యాసి పుట్టారు. కావున ఈ చతురాశ్రమాల పాలన పోషణ బాధ్యత గృహస్థుని ముఖ్యధర్మం. అంతేగాకుండా అతిథి సత్కారం, పశు పాలన, వ్యవసాయం, వ్యాపారం మొదలగునవి కూడా గృహస్థుని ముఖ్య ధర్మములే.

**3. ప్రశ్న : కుటుంబంలో పెద్దలపట్ల పిన్నలు, పిన్నలపట్ల పెద్దలు ఎలా మెలగాలి?**

**జవాబు:** కుటుంబంలో తమకంటే పెద్దవారైన వారందరికి సుఖశాంతులు కలిగించడం, వారికి సేవలు చేయడం, చెప్పిన మాటను వినడం, వారి అదుపులో మెలగడం చిన్నవాళ్ళ కర్తవ్యం. పెద్దలు కూడా పిన్నలపట్ల ప్రేమ, ఆదరాభిమానాలతో మెలగాలి. తమకు తామే "మేం పెద్దవాళ్ళం పూజనీయులం, ఆదరణీయులం" అని అనుకోరాదు. ఈ విధంగా



భావించినట్లయితే తమకు తామే అగౌరవపరచుకున్న వాళ్ళవుతారు. ఇతరుల హృదయంలో తమను గూర్చిన గౌరవభావం తగ్గిపోతుంది. కాలక్రమేణ పెద్దలమీద నిరాదరణ కలగడం ప్రారంభమౌతుంది. కావున పిల్లలు తమను గౌరవించినట్లే వారి మనస్సును అర్థం చేసుకొని వారికి అనుకూలంగా, బాగుపడే విధంగా సలహాలు ఇస్తూ ఉండాలి. కష్టాలు సహిస్తూ కూడా పిన్నలను పెంచి పోషించాలనీ, వారికి అన్నివిధాల సౌకర్యాలు కలిగించాలని పెద్దలు పెద్దమనస్సుతో భావించాలి. ఇలా మెలిగినప్పుడే పిన్నలకు పెద్దలపట్ల గౌరవభావం పెరుగుతుంది. పెద్దలు పిన్నలు ఒకరికొకరు భక్తి, ప్రేమ, ఆదరణలతో మెలగినప్పుడే కుటుంబం, సమాజం సుఖశాంతులతో వర్ధిల్లగలదు.

**4. ప్రశ్న: భార్యాభర్తల పరస్పర ప్రవర్తన ఎలా ఉండాలి?**

**జవాబు:** భర్త భార్య గురించి – "ఈమె తన తల్లిదండ్రులను, అన్నదమ్ముళ్ళను, అక్కాచెల్లెళ్ళను, స్నేహితురాళ్ళు మొదలగు వారందరిని విడిచి నా దగ్గరకు వచ్చిందంటే ఎంత గొప్ప త్యాగం చేసింది. కనుక ఈమెకు ఏవిధమైన కష్టము కలుగనీయరాదు. భోజన వస్త్రాభూషణాదులు మొదలగువాటికి ఎన్నడు లోటు కలిగించకూడదు. నాకంటే ఈమెకే ఎక్కువ సుఖం లభించాలి" అని భావిస్తూ ఆమె పాతివ్రత్య ధర్మవిషయంను కూడా దృష్టిలో ఉంచుకొని మద్యమాంస వ్యభిచారాది దుర్గుణములనుండి దూరుడై నిత్యం సదాచారి కావాలి. అప్పుడే ఆమె హద్దులు మీరకుండా పతియే దైవమని భావించి ఆజన్మాంతం సుఖశాంతులు కలిగిస్తుంది. భార్య కూడా భర్త పట్ల ఇలా మెలగాలి "నేను నా వంశం, కుటుంబం మొదలైనవి త్యజించి వీరి ఇంటికి వచ్చాను. నేటినుండి తల్లీ, తండ్రి, అన్న, అక్క, స్నేహితులు అందరూ నా భర్తే. వారే నన్ను జీవిత పర్యంతం పోషిస్తూ, లాలిస్తూ, కష్టంలో, సుఖంలో, తోడునీడగా నిలుస్తూ జీవన మాధుర్యాన్ని అందించే ప్రత్యక్షదైవం. వీరే నన్ను కనురెప్పలా కాపాడే వ్యక్తి. కష్టపడి సంపాదించి నన్ను సుఖపెట్టగల వ్యక్తి. నాకు నా భర్త తప్ప ఇంకెవ్వరుంటారు? ఎలాగు తల్లిదండ్రిని విడిచి వచ్చాను కాబట్టి నేను జీవించినన్నాళ్ళు వీరిని నమ్ముకునే బ్రతుకుతాను. వీరెల్లప్పుడు నావల్ల గౌరవాన్నే పొందాలి కాని అవమానం పొందకూడదు. నేనెంత కష్టాన్నైనా అనుభవింతును గాని వీరికి మాత్రం ఏ కొంచెము కష్టం కలుగనీయను" అని భావిస్తూ తన సుఖ సంతోషాలు త్యాగం చేసి భర్త యొక్క సుఖసంతోషాలు దృష్టిలో ఉంచుకొని మెలగాలి. ఇలా ఒకరికొకరు ఆదరించుకున్నప్పుడు గృహస్థాశ్రమం స్వర్గధామం కాక మరేమవుతుంది? పిల్లలు పుట్టి పెద్దవారై పెళ్ళిళ్ళు చేసుకొని ఎవరి సంసారం వారు సాగిస్తున్నప్పుడు చివరకు మిగిలేది భార్యాభర్తలే కదా!

**5. ప్రశ్న: అత్తాకోడళ్ళ పరస్పర ప్రవర్తన ఎలా ఉండాలి?**

**జవాబు:** అత్త ఇలా భావించాలి "నేనూ ఒకనాటి కోడలినే. మా అత్తగారితో ఎన్నో మంచి

చెడు అనుభవాలు సంపాదించాను. ఈనాడు ఈమె నా కొడుకుకు భార్యయై నా ఇంటికి వచ్చింది. ఈమె నా కొడుకులో సగభాగం. నా తర్వాత నా కొడుకును అన్నివిధాల చూసుకునేది ఈమెయే. నేను వృద్ధురాలనై రోగగ్రస్తురాలనయినప్పుడు ముఖ్యంగా సేవ చేసేది ఈమెయే. అంతేగాక తన తల్లిదండ్రిని విడిచి మన ఇంటికి వచ్చింది. ఆమెకు తల్లిదండ్రులు జ్ఞాపకం వచ్చేలాగ అంటే ఇక్కడ బాధ కలిగి తల్లిదండ్రులను తలచుకునేలాగ ప్రవర్తించకూడదు. స్త్రీ కన్నీరు కారిస్తే ఇంట్లో సుఖశాంతులుండవని అనుభవంతో తెలుసుకున్నాను. కాబట్టి ఈమెనే మా గృహలక్ష్మి. ఇంటి దీపాన్ని నిలబెట్టేది కూడా ఈమెనే. నా కూతురు కూడా ఒక ఇంటికి కోడలై వెళ్తుంది. అక్కడ ఆమె బాధలు పడుతుంటే నేను చూసి భరించగలనా? కావున నా కోడలును కన్నకూతురు కంటే బాగా చూసుకోవాలి. తన తల్లిని మరచిపోయేలా నేను ప్రవర్తించాలి. ఆమె నన్ను అత్తలా గాకుండా తల్లిలా చూసుకునేటట్లు మలచుకోవాలని భావించాలి. ద్వేషంతో ఏమీ సాధించలేం. ప్రేమతో అన్నీ సాధించగలమనే నిత్యసత్యాన్ని తెలుసుకొని నడవాలి.

కోడలూ ఇలా భావించాలి "నా పసుపు కుంకుమలకు, నా సౌభాగ్యానికి ఈమెయే జనని. నా సర్వస్వమైన వ్యక్తి ఈ వృక్షంయొక్క ఫలం. ఈ చెట్టుకే కాసిన ఫలం కాబట్టి ప్రధానంగా ఈమెనే గౌరవించాలి. ఎలాగూ నా తల్లిదండ్రిని విడిచి వచ్చాను. కాబట్టి ఆ లోటును అత్తమామల ద్వారా తీర్చుకోవాలి. ఆమెకు కోడలుగా గాక కూతురులా చూసుకునే విధంగా నా ప్రవర్తనను మలచుకొని సేవలు చేసి ఆమెను జయించాలి. ఆమెకు ప్రతిష్ఠ కలిగించాలి. నేను కష్టపడి ఆమెను సుఖపెట్టాలి. భవిష్యత్తులో నేను కూడా అత్తను కావలసివస్తుంది. కాబట్టి నేను ఇప్పుడే ఆదర్శంగా మెలిగితే అప్పుడూ ఇప్పుడూ ఎప్పటికీ సుఖపడతాను. ఆమె ఏదిచెప్పినా మా హితం కోరే చెపుతుంది. ఆమె మా మేలును కోరినంతగా ఇతరులెవ్వరూ కోరరు. నేను జబ్బుపడితే లేదా బాలింతరాలనైతే అత్తగారు సేవ చేసినట్లుగా మరెవ్వరూ చేయరనేది ప్రత్యక్షంగా కనిపిస్తూనే ఉంది. ఈమె ఉత్తరాధికారినీ నేనే. నాకు కలిగే సంతానాన్ని ఈమె ప్రేమించినంతగా ఇంకెవ్వరూ ప్రేమించరు. అత్తమామలు సంపాదించిన ఆస్తులన్నీ మేమే అనుభవించేది. వారి ఋణం ఎన్ని జన్మలైనా తీర్చుకొనలేం" అని తలపోయాలి. ఈ విధంగా అత్తాకోడళ్ళు ఒకరిని ఒకరు జయించేవిధంగా నడుచుకోవాలి. సాధించుకునే తీరుగా కాదు. ఒకరికొకరు సాధింపులు, వేధింపులు చేసుకున్నచో ఆ గృహం నరకమే అవుతుంది. స్వర్గతుల్యమేనాటికీ కాదు. తాము సుఖపడరు, తమ భర్తలను, పిల్లలను సుఖంగా, బ్రతుకనివ్వరు.

**6. ప్రశ్న: వదిన మరదుల మధ్య పరస్పర ప్రవర్తన ఎలా ఉండాలి?**

**జవాబు:** అన్న భార్యనే వదిన. 'అమ్మ'లోని మొదటి అక్షరం 'అ' 'నాన్న'లోని చివరి అక్షరం



'న్న'. ఈ రెండు కలిస్తే 'అన్న' అవుతుంది. తమ్ములపట్ల అన్న తల్లిదండ్రుల మాదిరిగానే ప్రేమాప్యాయతలను పంచుతూ ప్రవర్తిస్తాడు. అనేక విధాలుగా అండగా నిలుస్తాడు. కాబట్టి తల్లిదండ్రులతో సమానమైన అన్నయొక్క భార్య తల్లే అవుతుంది. రామాయణమే దీనికి ప్రత్యక్ష సాక్ష్యం. రాముని భార్యయైన సీతను లక్ష్మణ భరత శతృఘ్నులు తల్లిలా చూసేవారు. వారిని కూడా సీత పుత్రులుగా చూసుకునేది. వయసులో చిన్నదైనప్పటికీ వదిన తల్లి లాంటిదే. తల్లి తర్వాత వదిననే ఇంటికి పెద్దది. తల్లిలా చూసుకునేది ఆమెనే. "వదినగారిని మేమెంత మాతృభావంతో చూస్తామో అన్నగారు మాపట్ల దానికి రెట్టింపు ప్రేమతో చూస్తారు" అనే నిజమైన సత్యాన్ని తెలుసుకోవాలి.

వదిన కూడా మరదులపట్ల పుత్రవాత్సల్యాన్ని కనబరచాలి. తల్లి తన కొడుకు బిడ్డల ఆకలిదప్పులను, అవసరాలను స్వయంగా తెలుసుకొని ఎట్లా తీరుస్తుందో అంతకంటే ఎక్కువగా మరదులను చూసుకోవాలి. కొడుకులు తల్లిమాటలు విననప్పటికినీ తల్లి కొడుకులను ప్రేమించినట్లుగానే వదిన తన మరదులు అగౌరవపరచినప్పటికినీ వారిపట్ల వాత్సల్యమునే చూపి వారి మనస్సును మార్చే విధంగా ప్రవర్తించాలి. వదిన - మరదులు ఈ విధంగా మాతాపుత్ర సంబంధము కల్గినవారై కుటుంబాన్ని సమిష్టి కుటుంబంగా, స్వర్గలోకంగా చేసుకోవాలి.

**7. ప్రశ్న : బావ, బావమరదుల పరస్పర ప్రవర్తన ఎలా ఉండాలి?**

**జవాబు:** బావ బావమరిది పట్ల ఇలా ప్రవర్తించాలి "నా భార్య నాకు ఎంత ప్రియురాలో ఆమెకు అన్న లేదా తమ్ముడగుట వలన అతడు ఎంతో ఆదరింపదగినవాడు. నా భార్యకు ప్రియసోదరుడగుట వలన నాకునూ ప్రీతిపాత్రుడే. బాల్యంలో అక్క తమ్ముళ్ళను ఎత్తిదించుతుంది. వారికి అన్నపానాదులనందిస్తుంది. అన్నలకు చెల్లెలగుటవలన ఎన్నో మురిపాలను పొంది ఉంటుంది. ఒక చెట్టుకు చిగిరించిన రెమ్మల లాంటివాళ్ళు. వాళ్ళ సోదరి వారందరినీ విడిచి నన్ను చేరింది. వారిపట్ల ఈమెకు, ఈమెపట్ల వారికి విడదీయరాని రక్తసంబంధం ఉంది. ఒక్కతల్లి పాలు త్రాగారు కాబట్టి సోదరీ సోదరుల మధ్య విడదీయరాని ఆత్మీయతానురాగముంటుంది. నాకు ప్రియమైన వ్యక్తిని వారు అంతగా గౌరవిస్తున్నప్పుడు వారిని నేనెందుకు గౌరవించకూడదు? వారికి ప్రియమైన సోదరి కాబట్టి ఈమెను నేను ప్రేమగా చూసుకొనడంవల్లన సహజంగా నాపట్ల వారికి గౌరవభావమే ఉంటుంది. వారు తమ సోదరిని పర్వదినాలకు ఆహ్వానించి వస్త్రాభూషణాదులతో గౌరవిస్తారు. ఆపదలో అండగా నిలుస్తారు. కాబట్టి లోకదృష్టితో చూచినప్పటికీ బావమరిదిని గౌరవించడం లాభసాటే" అని భావించాలి.

బావమరిది బావపట్ల ఇలా ఉండాలి. "నాకు అత్యంత ప్రీతిపాత్రురాలయిన నా సోదరికి సర్వస్వము అతనే కాబట్టి సోదరికంటే అతడే సర్వదా గౌరవనీయుడు. బావను

గౌరవించి ఆదరించినట్లయితే మా సోదరికే ఎక్కువ సుఖం లభిస్తుంది. సోదరిని ఒకవేళ బావ బాధపెట్టినప్పటికీ అతనితో ఎప్పుడూ విరోధం పెట్టుకోరాదు. అతనిని ప్రేమతో నిజాయితీతో జయించి సోదరిని కాపాడాలి. సోదరి కొరకు నా ఆస్తిపాస్తులనూ, సుఖసంతోషాలనూ లెక్క చేయను. బావకు అన్నివేళలా అండగా నిలిచి సోదరి కుటుంబాన్ని సుఖసంతోషాలతో ఉంచుతాను" అని బావమరిది భావించాలి.

**8. ప్రశ్న : సోదరీ సోదరుల మధ్య ఎలాంటి వ్యవహారముండాలి?**

**జవాబు:** సోదరి సోదరుల పట్ల ఇలా మెలగాలి "మేము ఒకే చెట్టుకు కాసిన కాయలం. మేము విడిపోయినా మా శరీరంలో ప్రవహించేది ఒకే తల్లిదండ్రుల రక్తం. మా తల్లిదండ్రులు గతించిన తరువాత నన్ను తమ ఇంటికి పర్వము మొదలగు శుభ సందర్భములలో తీసుకొని వెళ్ళి సత్కరించేవారు వీరే. నన్ను కనిపెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు నేర్పిన తల్లిదండ్రులకు ఎల్లప్పుడు సన్నిహితంగా ఉండి సేవచేసేదీ వీరే. నా ప్రియమైన తల్లిదండ్రులకు అత్యంత ప్రీతిపాత్రులు కాబట్టి వీరిని నేను గౌరవించాలి. ఎలాగూ నేను తల్లిదండ్రుల సేవ చేయలేను. అందుకు తగినవారు వీరే కాబట్టి వీరు సర్వదా ఆదరణీయులు. తల్లిదండ్రులు, భర్త తరువాత నన్ను ఎక్కువగా ఆదరించేది నా సోదరులే. వీరికి నేను ప్రీతిపాత్రురాలనగునట్లు వ్యవహరించాలి.

సోదరుడు సోదరిపట్ల "మేము ఒకే తల్లిదండ్రికి జన్మించి బాల్యావస్థనుండి యవ్వనావస్థవరకు ఆటపాటలలో కలసి మెలసి అల్లారుముద్దుగా పెరిగాము. ఒకరికొకరం ఎంతో సేవ చేసుకొన్నాం. మా తల్లిదండ్రుల ఆస్తికంతటికీ నేనే అధికారినయ్యాను. నిజానికి నాతోపాటు సోదరికి కూడా సమానహక్కు ఉండి తీరాలి. కాని ఆమె ఇదంతా నా కొరకు త్యాగం చేసి పరాయి ఇంటికి వెళ్ళింది. కాబట్టి ఆమె త్యాగభావం స్మరించదగినది. ఆమెకు ఎలాగైనా సేవ చేయాలి. ఆమె త్యాగానికి ప్రతిఫలంగా నేనూ కొంత త్యాగం చేయాలి. నా తల్లిదండ్రుల తరువాత నామీదనే ఎక్కువ ఆశలు పెట్టుకొని జీవిస్తూంటుంది. ఆమెను ఎల్లప్పుడూ ఆదరించాలి. సంతృప్తి పరచాలి. సోదరి, కూతురు, బ్రాహ్మణోత్తమునితో సమానము. వారికి అన్నవస్త్రాది ఆభూషణాదులతో సన్మానించడం పుణ్యకార్యమవుతుంది. కావున నానుండి నా సోదరికి సుఖమే లభించాలి" అని భావించాలి. ఈనాడు తల్లిదండ్రుల ఆస్తిలో కొడుకులతోపాటు కూతుళ్ళకు కూడా హక్కు ఉన్నదని చట్టం చెబుతుంది. కాని ఆస్తిపంపకంలో అన్నాతమ్ముళ్ళే తగవులాడుతున్నప్పుడు సోదరీ సోదరులెందుకు తగవులాడరు? వారిరువురి మధ్య అన్నాచెల్లెళ్ళ పవిత్ర సంబంధముండనే యుండదు. ఆస్తిలో భాగమడిగేసరికి అలాంటి ప్రేమ ఉండనే ఉండదు. "ధనం కంటే ప్రేమనే గొప్పది. శాశ్వత అనుబంధాన్ని కలిగించేది ప్రేమనే" అని ఒండొరులు తెలుసుకోవాలి. కుక్కలు వాటి మధ్యకు రొట్టెముక్క రానంతవరకు ప్రేమతో



ఆడుకుంటాయి. అది వచ్చి పడినవెంటనే ఒకదానితో ఒకటి పోట్లాడుకుంటవి. మనిషి కూడా అలా ప్రవర్తిస్తే వాటికీ మనిషికీ తేడా ఏముంటుంది?

**9. ప్రశ్న : అతిథిపట్ల ఎలా మెలగాలి?**

**జవాబు:** నిశ్చితమైన తిథి సమయం ఏదీ లేకుండా వచ్చేవారిని అతిథులంటారు. గృహస్థుడు అతిథిసత్కారం చేయడం చాలా ముఖ్యం. బంధుమిత్రులు, విద్వాంసులు, పెద్దలు, సజ్జనులు ఎవరైనా సరే తమ ఇంటికి వచ్చినవారిని తగినట్లుగా గౌరవించడమే గృహస్థుని కర్తవ్యము. శాస్త్రములలో **"అతిథి దేవోభవ"** అని ఉపదేశింపబడినది. తన ఇంటికి వచ్చినవారిని ఆసనం వేసి కూర్చోమనడం, భోజన పానీయాలు మొదలగునవి ఇవ్వడం సదాచారం. బ్రహ్మచారి, సాధువు, సన్న్యాసి, విద్యాభ్యాసం చేసేవాడు, బాటసారి, క్షీణవృత్తియైనవాడు (అనగా ఇంటికి నిప్పంటుకొనిగాని, వరదలొచ్చిగాని, దొంగలు పడి నష్టపోయినవాడిని గాని, జీవనాధారం లేక బాధపడేవానినిగాని క్షీణవృత్తుడంటారు). మొదలగువారిని యథాశక్తిగా సత్కరించాలి. పంచమహాయజ్ఞములలో కూడా "అతిథి సత్కారం చేయకుండా భోజనం చేసే గృహస్థునకు పాపం కలుగుతుంది. ఇంటికి వచ్చిన అతిథి భోజనం చేయకుండా వెళ్ళితే అతని పాపం గృహస్థునికి అంటుతుంది" అని ఉంది." కొన్ని సందర్భాలలో దొంగ అతిథులు కూడా వస్తుంటారు. కావున జాగ్రత్తగా మెలగాలి.

**10. ప్రశ్న : ఇరుగు పొరుగువారితో ఎలా మెలగాలి?**

**జవాబు:** ఇంటి ప్రక్కవారితో, పొలం ప్రక్కవారితో ఎప్పుడూ కలహించగూడదని పెద్దలంటూంటారు. ఇరుగు పొరుగువారిని యథాయోగ్యంగా గౌరవించినప్పుడే మనలను గూడ వారు గౌరవిస్తారు. మర్యాద అనేది ఇచ్చి పుచ్చుకునేది. కష్టసుఖాలలో కలిసిమెలిసి యున్నప్పుడే అది శాంతి సమాజమనబడుతుంది. **"ఉదార చరితానాం తు వసుధైక కుటుంబకమ్"** విశాల హృదయంతో మెలిగేవారికి ప్రపంచమే ఒక కుటుంబంగా గోచరిస్తుంది. తన ఇంటికి క్రొత్తగా తినుబండారాలు, పండ్లు మొదలగునవి వస్తే పొరుగువారికి కూడా కొన్ని ఇవ్వాలి. వారు కూడా తమ ఇంటికి ఇలాంటివి వచ్చినపుడు మరచిపోకుండా ఇస్తారు. ఒకరిపట్ల ఒకరికి ఆదరాభిమానాలు పెరుగుతాయి. పొరుగువారి పశువులు తమ వాకిళ్ళలోకిగాని, పొలాలలోకి గాని వస్తే ప్రేమతో ఇంకొకసారి దయచేసి రానివ్వకండి అని ప్రేమగా చెప్పాలి. కాని దురుసుగా ప్రవర్తించకూడదు. అలా ప్రవర్తించినట్లయితే సమయం చూసి దెబ్బతీస్తారు. కావున పొరుగువారికి ఇలాంటి అవకాశం ఇవ్వకుండా జాగ్రత్త పడాలి. ప్రేమకున్న బలము, విలువ దేనికీ లేదని భావించాలి.

పొరుగు వారందరు మంచివారేనని ఎప్పుడూ భావించకూడదు. **"దుష్టో దూరవర్జితః"** అన్నట్లు వారికి సాధ్యమైనంతవరకు దూరంగా ఉంటూ మెలగాలి. విరోధం పెట్టుకోరాదు.

మాటిమాటికి స్త్రీలు పొరుగు వారింటికి పోరాదు. పొరుగు వారి పురుషులను కూడా పనిలేకుండా తమ ఇంటికి రావద్దని ప్రేమగా చెప్పాలి. వ్యర్థాలాపనలు చేయరాదు. సామాన్యంగా చాలామంది ఇరుగు పొరుగువారు స్త్రీ పురుషభేదం లేకుండా గప్పాలతో వ్యర్థమైన మాటలతో కాలం గడుపుతారు. ఒకరి గురించి ఒకరు చాడీలు చెప్పుకుంటారు. తద్వారా కలహాలు, విభేదాలు కలుగుతాయి. చాలా కలహాలు భూమి, స్త్రీల విషయాలలోనే కలుగుతాయి. కాబట్టి పొలం దగ్గర, ఇంటిదగ్గర ఇరుగు పొరుగుతో ప్రేమగా ఉంటూనే జాగ్రత్తగా మెలగాలి. వివాహాది శుభకార్యాలలో ఒకరికొకరు సహకరించుకుంటూ ఉండాలి.

**11. ప్రశ్న : యజమాని నౌకరు – సేవకునితో ఎలా వ్యవహరించాలి?**

**జవాబు:** నౌకరును కుటుంబ సభ్యునిగానే భావించాలి. ఇంట్లో వారికంటే అతనిపట్ల ఎక్కువ ఆదరాభిమానాలు చూపాలి. దానిని గ్రహించి అతడు రెట్టింపు పనిచేస్తాడు. సంతోషమే సగం బలం నిస్తుంది. యజమాని పట్ల భక్తితో నిజాయితీగా ప్రవర్తిస్తాడు. నౌకరులు రెండు రకాలుగా ఉంటారు. 1. జీతం తీసుకొని, పనిచేసేవాడు. 2. జీతంతోపాటు భోజనం చేస్తూ పనిచేసేవాడు. భోజనం చేస్తూ జీతం తీసుకొనే నౌకరుకు భోజనం విషయంలో భేదం చూపకూడదు. సామాన్యంగా ఇళ్లలో నౌకర్లకు వేరుగా ఇంట్లోవారికి వేరుగా వంటలు చేస్తుంటారు. ఇలా చేయడం చాలా నీచమైన పని. నౌకరు కష్టపడి పనిచేస్తేనే కదా ఇంట్లోవారు సుఖపడేది. అతని భోజనంలో భేదం చూపడంవల్ల అతడు పనిలో భేదం చూపిస్తాడు. ఎదుటివారి ప్రవర్తనను బట్టే తన నడవడిని మార్చుకుంటారెవరైనా. అతడు విధిలేక జీతమున్నాడేగాని మానవత్వంలో, ప్రేమాదరాభిమానాలలో తక్కువేమీ కాదు. అతనికీ ఒక మనసు ఉంటుంది. ఆ మనస్సును ఎన్నడూ బాధించకూడదు. యథాయోగ్యంగా ప్రవర్తించాలి. భోజనం విషయంలో వేరుగా చూడకూడదు. పైగా లెక్క ప్రకారం అతనికి పౌష్టికాహారం ఇవ్వాలి. తిండి కలిగితేనే గదా కండ కలిగేది. బలంతో పనిచేసేది. ప్రేమగా పని చెప్పాలి. చేయించాలి. కసురుకొనడం వలన అతని మనస్సు చివుక్కుమంటుంది. క్షోభ చెందుతాడు. చంచలుడవుతాడు. దానితో చేసే పని ఇంకా చెడిపోతుంది. లేదా కావాలని కూడా నష్టం కలిగించవచ్చు. కేవలం జీతం తీసుకొని భోజనం చేయకుండా పనిచేసే నౌకరుకు ఇంట్లో పిండివంటలు, పండుగలు చేసినప్పుడు తప్పకుండా అతనికి, అతని పిల్లలకు పెట్టాలి. వివాహాది శుభకార్యాలలో నూతన వస్త్రాలు కూడా ఇవ్వాలి. జీతంతోనే సరిపెట్టకుండా అప్పుడప్పుడు చిన్న చిన్న బహుమతులు, బట్టలు, పిండివంటలు మొదలైనవి పెడుతుండాలి. జీతం కంటే బహుమతులకే ఎక్కువ సంతోషపడతారు. వారి హృదయంలో యజమాని పట్ల భక్తిశ్రద్ధలు పెరుగుతాయి. నమ్మకంతో పనిచేస్తాడు. సమయం వచ్చినప్పుడు శత్రువుల నుండి, దొంగలనుండి రక్షిస్తాడు. వివాహాది శుభకార్యాలలో ఉత్సాహంతో పనిచేస్తాడు. అతడు చేసే



చిన్న చిన్న పొరపాట్లను మాటిమాటికి ఎత్తి చూపకూడదు. రోగగ్రస్తుడైనపుడు మంచి వైద్యం చేయించాలి. విశ్రాంతిని కలిగించాలి. ప్రేమతో అతనిని ఆదరిస్తే భక్తితో ప్రాణాలైనా ఇస్తాడు.

**12. ప్రశ్న : కుటుంబంలో తగవు, కలహం, అశాంతి మొదలైనవి జరగడానికి కారణాలేమిటి?**

**జవాబు:** ఒకే తల్లిదండ్రికి జన్మించినప్పటికీ, ఒకే కుటుంబంలో నివసిస్తున్నప్పటికీ అందరి మనస్సు, బుద్ధి ఒకే తీరుగా ఉండదు. ప్రతిఒక్కరు తన సుఖశాంతులను, అనుకూలతలను కోరుకుంటారు. తన మనస్సుకు కష్టం కలిగించేవాటినన్నింటినీ ద్వేషిస్తాడు. తన అస్తిత్వాన్ని చూపాలనుకుంటాడు. ఒక వస్తువు పొరపాటున సమానంగా తనకు అందకపోవడం జరిగితే వ్యథ చెందుతాడు. చాలా కలహాలు వ్యక్తిగత కారణాలవల్లనే వస్తుంటాయి. పెద్దలపట్ల పిన్నలకు, పిన్నలపట్ల పెద్దలకు సరియైన అవగాహన లేకపోవడం కూడా అశాంతికి కారణమవుతుంది. పెద్దలు సామాన్యంగా చిన్నవారికి ఏమీ తెలియదని భావిస్తుంటారు. దానితో చిన్నవారు తమను బాగా చూడటంలేదని, స్వాతంత్ర్యం ఇవ్వడంలేదని మనసులో మధనపడుతూ అదను చూసుకొని అసంతృప్తిని బయటపెడతారు. దానిని పెద్దలైనవారు అర్థం చేసుకొనలేక మాకు ఎదురు తిరుగుతున్నారని, గౌరవించడంలేదని, ఎవరో నేర్పుతున్నారని, మమ్ములను ధిక్కరిస్తున్నారని భావించి గట్టిగా వారిని మందలిస్తుంటారు. హక్కులు, బాధ్యతలను కుటుంబంలోని పెద్దలూ చిన్నలూ బాగా తెలుసుకొని నడవాలి. పిన్నలు హక్కులే కోరుతారు, బాధ్యతలు స్వీకరించరు. వీనితో పెద్దలు ఆగ్రహులవుతారు. పెద్దలు చిన్నవాళ్ళను సుఖపెట్టాలని ఎలా నడుస్తారో, చిన్నలు కూడా పెద్దవాళ్ళను అలా గౌరవించి, వారి మనస్సుకు శాంతి సుఖము కలిగేలాగున నడచుకోవాలి. ఇలా ప్రవర్తించినప్పుడే కుటుంబంలోని వారందరు సుఖంగా ఉంటారు. ఈ కాలంలో పూర్వకాలం మాదిరి సమిష్టికుటుంబాలు అంతగా లేవు. వ్యష్టి కుటుంబాలే ఎక్కువగా ఉన్నవి. భార్యాభర్తలు ఇద్దరు ముగ్గురు పిల్లలతో జీవితం గడుపుతున్నారు. తల్లిదండ్రులతో, అన్నదమ్ములతో కలిసి జీవించే మనస్తత్వాలు నేడు కనుమరుగవుతున్నాయి. దీనివల్ల ఎన్నో కుటుంబ సమస్యలు పుట్టుతున్నవి. వృద్ధాప్యంలో తల్లిదండ్రులు దిక్కులేనివారవుతున్నారు. వీటన్నింటికి కారణాలనేకాలున్నాయి. ప్రతి మనిషి విలాస జీవితాన్ని గడపాలనుకోవడం కలహానికి ప్రధాన కారణం. సమిష్టిగా కుటుంబంలో అందరూ సుఖపడాలనుకున్నవారు రామాయణాన్ని ఆదర్శంగా తీసుకొని జీవించాలి. ఒకరికొకరు చిన్న చిన్న త్యాగాలు చేసుకుంటూ తనకంటే తనవాళ్ళే ఎక్కువ సుఖపడాలని ఒండొరులు భావించినప్పుడే గృహం స్వర్గంగా ఉంటుంది. తగవులు, కలహాలు, అశాంతులుండవు.

**13. ప్రశ్న : అన్నదమ్ములు తమలో తాము పోట్లాడుకుంటే తల్లిదండ్రులు ఏమి చేయాలి?**

**జవాబు:** అన్నదమ్ములు పోట్లాడుకుంటే తల్లిదండ్రులు వేరువేరుగా కొడుకులను పిలిచి ఇలా

గట్టిగా మందలించాలి. ఏ ఒక్కరి పక్షం వహించకూడదు. పెద్దకొడుకుకు ఇలా చెప్పాలి – “చూడు నాయనా! మా తరువాత నీవే గృహానికి యజమానివి. చిన్నవాళ్ళకు తల్లిదండ్రితో సమానం. చిన్నవాళ్ళు తప్పు చేసినా వారిని క్షమించి తప్పు తెలుసుకునేలా వ్యవహరించాలి. మానసికంగా సంస్కరించాలి గాని శారీరకంగా దండించకూడదు. నిన్ను అవమానపరచే అవకాశం వారికి కలిగించకు. రామాయణంలోని రామునిలా వారిని బిడ్డలుగా చూడు. నీవు ఆదర్శంగా ఉంటే చిన్నవాళ్ళు తప్పక నిన్ను గౌరవిస్తారు. కావున రామునిలా మెలుగు. ధర్మజునిలా నడువు. వారి భార్యలను బిడ్డలతో సమానంగా చూస్తూ వస్త్రాదిభూషణాదులు ఇవ్వు. ఎప్పటికినీ చిన్నవాళ్ళతో పోట్లాడవద్దు”ని చెప్పాలి.

చిన్నకొడుకు(ల)కు ఇలా నచ్చచెప్పాలి – “మా తరువాత మా అంతగా గౌరవింపదగినవాడు మీ అన్న. అతనిని ఎదిరించడం, అవమానపరచడం తల్లి దండ్రిని ఎదురించడమే అవుతుంది. ఈ కుటుంబం కొరకు మీకంటే అతడే ఎక్కువ కష్టాల ననుభవించాడు. మిమ్ములను చిన్నతనంలో ఎత్తిదించాడు. సేవచేశాడు, ఆడించాడు, అల్లారుముద్దుగా లాలించాడు. అలాంటివానితో మీకు విరోధమా? ఇది చాలా తప్పు. లక్ష్మణభరత శత్రుఘ్నులు రామున్ని ఎలా గౌరవించారో, భీమార్జున నకుల సహదేవులు ధర్మరాజు పట్ల ఎలా మెలిగారో మీకు తెలియదా? అన్న మిమ్ములను దండించినా, కోపగించినా మీ మేలును కోరి చేస్తాడు. అతనిని భక్తితో గౌరవించండి. అతడు మిమ్ములను తప్పక ప్రేమస్తాడు.” అని చెప్పాలి.

కొడుకుల నందరినీ పిలిచి తల్లిదండ్రులు ఇలా ఉపదేశించాలి. “నాయనలారా! మీలో మీరే ఇలా పోట్లాడుకుంటే ఇరుగుపొరుగువారు చాలా చులకనగా చూస్తారు. మిమ్ములను పూర్తిగా విడదీసి మీరు పోట్లాడుతుంటే చూసి ఆనందించాలనుకుంటారు. మీరు ఐకమత్యంగా ఉంటే వారి మాటలు చెల్లవని కుతంత్రాలు పన్నుతారు. చిన్న చిన్న విషయాలకు విడిపోయి రక్తసంబంధాన్ని చీల్చుకోకండి. మీరు ఐకమత్యంగా ఉంటే శత్రువులే కాదు ఎవ్వరూ మిమ్ములను ఎదురించలేరు. ఒక్కొక్క కట్టెను సులువుగా విరిచివేయవచ్చును. నాలుగు కట్టెలను ఒకేసారి విరిచి వేయగలమా? ఐకమత్యమే మహాబలము. ఏవైనా చిన్న చిన్న పొరపాట్లు జరిగితే బయటపడకుండా జాగ్రత్తగా ఇంట్లో తమ మధ్యనే పరిష్కారం చేసుకోవాలి. పరిష్కారంలో హెచ్చుతగ్గులు జరిగినా మీరే కదా అనుభవించేది. ఒకవేళ మీరు వేరు వేరు కాపురాలు పెట్టినా కుటుంబం విషయంలో ఐకమత్యంగా ఉండండి. ఇతరులు మీ విషయంలో జోక్యం చేసుకోకూడదు. ఆదర్శ సోదరులై మాకు సంతోషం కలిగించండి. మా ముందే ఇలా పోట్లాడుకుంటే మాకు శాంతి ఎలా లభిస్తుంది? ప్రేమయే సుఖశాంతులకు మూలమని తెలుసుకోండి.



**14. ప్రశ్న : అన్నా–చెల్లెలు లేదా అక్కా–తమ్ముడు పోట్లాడుకుంటే తల్లిదండ్రులేమి చేయాలి?**

**జవాబు:** మొదట కూతురు పక్షం వహించి తర్వాత వేరు వేరుగా ఇలా నచ్చచెప్పాలి. నాయనా! అక్క లేదా చెల్లెలు ఏనాటికైనా పరాయింటిరాలు. నీవే ఈ యింటి యజమానివి. సోదరి అతిథితో సమానం. అతిథిని అవమానపరిస్తే ఎంత పాపమో సోదరిని అవమానించడం కూడా అంతే తప్పు. అక్క నిన్ను చిన్నతనంలో ఎంతో ఎత్తి దించింది. నీ మలమూత్రాలు కూడా ఎత్తివేసింది. తన సుఖాన్ని కూడా త్యజించి నీకెంతో సేవ చేసింది. ఆమె నీకు అమ్మతో సమానం. చెల్లెలు కూడా నీతో కలిసి ఆడుకున్నది. నీవు కూడా ఆమెను ఎత్తి దించావు. ప్రేమగా లాలించావు. ఆమె నీకు కూతురితో సమానం. వారిని కించపరచడం తగునా? నీకు మామీద ఎంత అధికారముందో ఆమెకూ అంతే అధికారమున్నది. ఆమె సమస్త ధన సంపత్తులను నీకొరకు త్యాగం చేసి పరాయి ఇంటికి వెళ్ళినది. (లేదా వెళ్ళుతుంది). మా తరువాత నీవే వారికి తల్లిదండ్రి కర్తవ్యం చేసేది. ఎన్నటికైనా సోదరితో కలహించడం నీదే తప్పవుతుందని తెలుసుకో.

కూతురుకు కూడా ఇలా తెలియపరచాలి. చూడమ్మా! అన్నతోగాని, తమ్మునితోగాని విరోధము పెట్టుకొనరాదు. మా తరువాత అతడే గదా నిన్ను పండుగలకు, వివాహాది శుభకార్యాలకు ఆహ్వానించి గౌరవించి సంతోషపెట్టేది. నీవు మీ అత్తగారింటికి వెళ్ళిపోతావు. కానీ, మా సేవ చేసేది వాడేకదా! నాకంటే తల్లిదండ్రులనే ఎక్కువ చూడాలని సోదరునితో కోరాలి. సోదరుని దగ్గరనుండి ఏదీ ఆశించకూడదు. సోదరుడిచ్చిన దానిలో కొంచెమే గ్రహించాలి. అతనినుండి పొందినంత మాత్రాన మన జీవనం గడువదు. మన ఇంటితోనే గడుస్తుందని భావించాలి. అన్నదమ్ముళ్ళతో ప్రేమగా మెలగాలి. వారి ఆదరాభిమానాలను పొందాలి. వారిలో నిన్ను గౌరవించాలనే భావన పుట్టాలి. అలా నీవు వ్యవహరించాలి.

ఇద్దరినీ కూర్చోబెట్టుకుని ఇలా నచ్చచెప్పాలి. “అన్నాచెల్లెళ్ళ అనుబంధం ఒకనాటితో పోయేది కాదు. త్యాగానికి ప్రతిరూపాలు మీరిద్దరు. సోదరి త్యాగం చేసి వెళుతుంది. సోదరుడు కూడా సోదరి సుఖానికి తనుమనోధనములను త్యాగం చేయాలి. ప్రేమపాశంతో బంధితులు కావాలి కాని దురాశాపాశాలతో కాదు. అన్యోన్య అనురాగంతో మెలగండి” అని చెప్పాలి.

**15. ప్రశ్న : కొడుకు – కోడలు కలహించుకుంటే తల్లిదండ్రేమి చేయాలి?**

**జవాబు:** మొదట కోడలు పక్షం వహించి కలహాన్ని శాంతింపజేయాలి. ఇద్దరినీ వేరు వేరుగా పిలిచి ఒకరిపైన ఒకరికి ప్రేమానురాగాలు కలిగేటట్లు ఉపదేశించాలి. కొడుకుతో “బాబూ! నీ కోసమే ఆమె తన తల్లిదండ్రినీ, అన్నా వదినలను, సోదరీ సోదరులను బంధుమిత్రులను విడిచి మన ఇంటికి వచ్చింది. నీవు మాత్రం నీ తండ్రి సింహాసనముపై కూర్చున్నావు. నీవేం

త్యాగం చేశావు? త్యాగమూర్తియైన స్త్రీని తనుమనోధనములతో ప్రసన్నురాలిగా ఉంచాలి. కాని, శారీరకంగా మానసికంగా బాధించుట తగునా? ఆమెను సుఖసంతోషాలతో ఉంచడం నీ ముఖ్య కర్తవ్యం. భార్యనే జయించి పాలించలేనివాడవు నీవేమి సాధిస్తావు? ఆమె మనస్సును సంతోషపెట్టినచో అహోరాత్రాలు నీకు సేవచేస్తుంది. ఒకటి మాత్రం గుర్తుంచుకో. నీవు పతివి. స్త్రీ దాసత్వంలో చిక్కుకోకూడదు. అగ్నిసాక్షిగా నీవు ఆమెను పెళ్ళి చేసుకున్నావు. కష్టాల్ని సుఖాల్ని సమానంగా పంచుకుంటానని, జీవితాంతం కలిసి ఉంటానని ప్రతిజ్ఞ చేశావు కదా! మరిచిపోయావా! వెళ్ళు. ఆమెను ఓదార్చు" అని హితవు చెప్పాలి.

కోడలుకునూ ఇలా ఉపదేశించాలి. "అమ్మా! నీవు నీ వాళ్ళందరినీ వదిలి మా ఇంటి దీపమై వెలగడానికి వచ్చావు. నీ భర్తను ఆనందసముద్రంలో ఓలలాడించడానికి వచ్చావు. నీవు భర్తతో రాజీపడకపోతే, అతన్ని సేవించకపోతే ఇంకేం చేయగలవు? సముద్రం దాటి ఒడ్డుకు వచ్చి అక్కడ మునిగిపోతే ఎంత వ్యర్థం? ఏనాటికైనా ఈ ఇంటి యజమానురాలివి నీవే. నీ భర్తలో చెడు గుణాలేమైనా ఉంటే ప్రేమతో వాటిని దూరం చేయాలి. లేదా పెద్దలమైన మాకు చెప్పాలి. కాని భర్తతో ఇలా కలహమాడవచ్చా? పొరుగువారు చూసినా, విన్నా మీరెంత చులకనైపోతారు? జీవిత మాధుర్యాన్ని అనుభవించవలసిన మీరు మీ జీవితంలో మీరే నిప్పులు పోసుకుంటారా? వెళ్ళు. నీ భర్తను క్షమాపణ కోరుకో" అని మందలించాలి. ఇద్దరినీ పిలిచి ఇలా చెప్పాలి - ఈ ఇంటికి యజమానులు మీరే. మీరే పరస్పరం పోట్లాడుకుంటే ఈ కుటుంబపాలన ఎవరు చేస్తారు? ఈ గృహ సామ్రాజ్యమంతా మీదే కదా! కుటుంబమనే బండికి భార్యాభర్తలు రెండు చక్రాల లాంటివారు. ఏ ఒక్కటి సహకరించకపోయినా బండి ముందుకు సాగదు. ఎలాంటి ఒడుదుడుకులు లేకుండా సాగినప్పుడే సాఫల్యమనే గమ్యం ఒడ్డుకు చేరుకుంటారు. అగ్నిసాక్షిగా కలిసి మెలిసి స్నేహితులుగా జీవిస్తామని చేసిన ప్రతిజ్ఞలు మరిచారా? లేనిపోని పంతాలకు పోయి మీ జీవితాన్ని మీరే నాశనం చేసుకుంటున్నారు. జీవిత ప్రయాణంలో ఎగుడు దిగుడులుగా కష్టసుఖాలు సమానముగానే ఉంటాయి. ఎవరికి వారు జీవించడం కాదు జీవించడమంటే ఒకరికొకరు త్యాగం చేసుకుంటూ జీవించడమే నిజమైన జీవించడమనబడుతుంది.

**16. ప్రశ్న : కూతురు - కోడలు కలహించుకుంటే తల్లిదండ్రేమి చేయాలి?**

**జవాబు:** మొదట కోడలు పక్షమే వహించి కలహాన్ని శాంతింపజేయాలి. ఇద్దరికీ వేరు వేరుగా ఇలా ఉపదేశం చేయాలి. కూతురితో- "చూడమ్మా! వదిన ఈ ఇంటికి యజమానురాలు. ఎంత పరాయిరాలయినా, ఎటువంటిదైనా మీ అన్నయ్యను (లేదా తమ్ముణ్ని) భర్తగా పొంది వచ్చింది. ఎన్నటికైనా ఆమెనే ఈ ఇంటికి యజమానురాలు. నీవు ఎంతటి గారాబాల బిడ్డవైనా పరాయి ఇంటిదానివే. నీవు ఎప్పటికైనా ఈ ఇంటికి అతిథురాలవు మాత్రమే. అతిథి ఇంటి యజమానితో కలహించుకున్నచో సత్కారములు లభించునా? నీవు



నాకంటే ఈమెనే ఎక్కువగా గౌరవించు. నీవు నన్ను గౌరవించకపోయినా నాకు బిడ్డవు కావున బాధపడను. భవిష్యత్తులో నీకు మంచి చెడ్డలు చూసేది, నీ తల్లి గారింటిని కాపాడేది మీ వదిననే కదా! యథార్థాన్ని తెలుసుకొని మసలుకో".

కోడలితో "చూడమ్మా! నీవు ఈ ఇంటికి యజమానురాలివి. ఆడుబిడ్డ ఈ ఇంటిలో పుట్టినప్పటికీ పరాయి ఇంటిదే. కావున మన ఇంట్లో ఉన్నన్ని రోజులు మనకామె అతిథురాలుతో సమానం. అతిథిని అవమాన పరచదగునా? అతిథిని అవమానించడం గోహత్యకంటే మహాపాపం. కావున నీవు ఈ ఇంటి ఆడబిడ్డను ఎల్లవేళలా గౌరవించాలి. ఆడపడుచు పిల్లల్ని తనపిల్లలకంటే ఎక్కువ ప్రేమగా చూడాలి. (తోడికోడలు పిల్లల్ని రెండవ స్థానంలోనూ, పెద్దకోడలు పిల్లల్ని మూడవస్థానంలోనూ, నాల్గవ స్థానంలో తన పిల్లలను ప్రేమించాలి). ఇలా ఎన్నో మంచి మాటలు చెప్పి కలహం పూర్తిగా నివృత్తయ్యేవిధంగా చూడాలి.

తల్లీకూతుళ్ళు కూడా కొన్ని విషయాలు తెలుసుకోవాలి. కూతురి మీద మోహంతో తల్లి ఏదైనా ఇవ్వదలుచుకుంటే కూతురు అది తీసుకోకూడదు. కూతురు తల్లితో "వదిన గారు ఇస్తే తీసుకుంటాను. నీవిస్తే వదినకది చెడుగా తోచవచ్చు. నీతో పోట్లాడుతుంది. మీకు కలహం కలిగించుటకు నేనిక్కడకు రాలేదు. నీవు కొన్నిరోజులే ఇవ్వగలవు. కాని వదినగారి నుండి తీసుకుంటే ఎల్లవేళలా లభిస్తుంది. ఆమె యజమానిత్వాన్ని నిలబెట్టిన వాళ్ళమవుతాము. మనమే ఆమెలో త్యాగబుద్ధిని పెంచాలి. ఎలాగూ అన్నా, తమ్ముడు నా పట్ల ప్రేమను చూపేవారే కదా!" అని చెప్పాలి. తల్లి కూతురుతో - అమ్మా! మేము నీకు చాలా ఇవ్వాలనుకుంటున్నాము. కాని వదిన ఆమోదం కూడా ఉండాలి కదా! ఆమెను ఒప్పించి ఆమె ద్వారానే నీకు ఎక్కువ పారితోషికాలు ఇప్పించగలను. మేము ఇవ్వగల సామర్థ్యులమయినప్పటికీ ఎవరికి బాధ అనిపిస్తుందో వారి ద్వారానే నీకు ఇప్పిస్తే ఆమె కూడా సంతోషిస్తుంది. ఆమె గౌరవాన్ని కూడా కాపాడినవారమవుతాము అని చెప్పాలి. అత్త కోడలుకు కూడా ఆడబిడ్డకు చేయవలసిన కార్యాలు, లాంఛనాలు మొదలగు వాటి గురించి సున్నితంగా ప్రేమతో ప్రశాంతమైన వాతావరణాన్ని, సమయాన్ని చూసి తెలియజెప్పాలి. ఇలా ఒకరినొకరు గౌరవించుకుంటూ మసలుకుంటే ఎన్నటికీ అత్తాకోడళ్ళ మధ్య గాని, వదిన మరదళ్ళ మధ్యగాని కలహాలు రావు గదా ప్రేమనే పెంపొందుతుంది. దీనితో సుఖశాంతులతో వర్ధిల్లగలరు.

**17. ప్రశ్న : అన్న - తల్లిదండ్రితో పోట్లాడితే తమ్ముళ్ళు ఏమి చేయాలి?**

**జవాబు:** అన్నకు వినమ్రులై నమస్కరించి "అన్నయ్యా! నీవే ఇలా ప్రవర్తిస్తే మేమెవర్ని ఆదర్శంగా భావించాలి? కావున నీవు మామీద దయుంచి తల్లిదండ్రులతో ఉత్తమోత్తమమైన ప్రవర్తనతో మెలగాలి. ఇలా ప్రవర్తించడంవల్ల నీకు రెండు ప్రయోజనాలు కలుగుతాయి. ఒకటి - మీ

సత్ప్రవర్తన ప్రభావం కుటుంబం మీద, గ్రామం మీద పడుతుంది. రెండు – మీ ఆచరణను మేము ఆదర్శంగా తీసుకుంటాం. అలాగే ఆచరిస్తాం. మన కుటుంబం ఆదర్శ కుటుంబమవుతుంది. శ్రీరామకుటుంబమవుతుంది. నీవు శ్రీరామచంద్రునిలా వ్యవహరించాలి. నీవు సదాచార సంపన్నుడవయినప్పుడే కదా నిన్ను ఆదర్శంగా తీసుకొని భయభక్తులతో మేము మెలిగేది? మీ శాసనాన్ని మేము పాటించడానికి ముందు మీరు అనుశాసనంలో ఉండాలి. అప్పుడే మమ్ములను శాసించి పాలించగలరు. మిమ్ములను మేము సాదరంగా ప్రార్థిస్తున్నాము. తల్లిదండ్రి తర్వాత వారితో సమానమైన వాడవు నీవే కదా!" అని విన్నవించాలి.

**18. ప్రశ్న: తమ్ముళ్ళు – తల్లిదండ్రితో పోట్లాడితే అన్న ఏం చేయాలి?**

**జవాబు:** అన్న తమ్ముళ్ళతో – "ప్రియమైన తమ్ముళ్ళారా! మనమందరం పిల్లలం. తల్లిదండ్రులు అన్నివేళలా పూజింపదగినవారు. ఆదరణీయులు. ఈ శరీరం మనకు లభించిందంటే అది వారి దయవల్లనే గదా! పుట్టుకతోనే మనం పితృఋణంతో పుడతాం. వారి ఋణం నుండి ఎప్పుడూ విముక్తి కాలేం. వారి ఆజ్ఞానుసారం నడుచుకున్నప్పుడే ఆ ఋణం కొంత తీర్చుకున్నవాళ్ళమవుతాం. వారు మనలను కోపగించినా ఏమిచేసినా మన మంచికొరకే చేస్తారు. వారు మనకు చేసినంత హితం, కోరినంత మేలు ఎవరూ కోరరు. అన్నివేళలా మన అభివృద్ధిని కాంక్షించేవారే కాని కీడు చేయువారు కాదు. మనం మన చర్మంతో చెప్పులు కుట్టించి తల్లిదండ్రికి తొడగించినా వాళ్ళ ఋణం తీరదు. ఎందుచేతనంటే ఈ చర్మం కూడా వారిచ్చిందే కదా! ఈ శరీరం వారిదే. వారు పోషించి పెద్దచేసినదే. కాబట్టి ఈ శరీరమనే వస్తువుపైన వారికి పూర్తి అధికారముంది. రామాయణంలో చూడండి తండ్రి ఆజ్ఞపైన తనయులెంత భక్తిశ్రద్ధలు చూపి నడచి ఆదర్శసోదరులైనారో, తల్లిదండ్రిదేమైనా పొరపాటు జరిగితే ప్రేమతో అలా జరగకూడదని ప్రార్థించాలేగాని విరోధించకూడదు" అని చెప్పాలి.

**19. ప్రశ్న: సోదరి తల్లిదండ్రులతో పోట్లాడితే సోదరుడు ఏం చేయాలి?**

**జవాబు:** సోదరుడు సోదరి పక్షమే వహించి కోపమును తగ్గించాలి. తల్లిదండ్రులకు ఇలా చెప్పాలి. "అక్క లేదా చెల్లెలు మనందరికీ ప్రీతిపాత్రురాలు. తల్లిదండ్రులైన మీరే ఆమెను నిరాదరిస్తే ఎలా? మిమ్ములను ఆదర్శంగా ఎలా తీసుకోవాలి? ఆమె కోరినది ఇచ్చి సంతృప్తి పరచండి. నాకు సంపాదించి పెట్టుటకు ఆమె మనస్సును ఎందుకు బాధపెడతారు? ఆమె ఎల్లప్పుడూ మనకు అతిథి. ఆమెను సత్కరించడమే మన కర్తవ్యం."

సోదరితోనూ ఇలా విన్నవించాలి. అక్క లేదా చెల్లి! "తల్లిదండ్రిని మనం ప్రేమించాలి. వారి స్థితిగతులను అర్థం చేసుకోవాలి. వారిని బాధించి మనం సాధించేదేముంది? మనలను కని పెంచి పెద్దచేసిన వీరితోనా విరోధము? ఇంతచేసిన వారు మనకు అపకారం చేస్తారా? వీలుకాక నీ కోరికలు తీర్చడంలేదు కాని అన్యధా కాదు. చిన్న విషయాలకొరకు వారినెందుకు



నిరాదరించాలి? వారు నిన్ను ఆదరించకపోతే నేనున్నాను గదా! నన్ను చూసైనా వారితో విరోధం మాను. నీ కే త్యాగం చేయడానికైనా సిద్ధంగా ఉన్నాను" అని చెప్పాలి.

**20. ప్రశ్న: తమ్ముడు వదినతో పోట్లాడితే అన్న ఏం చేయాలి?**

**జవాబు:** మొదట భార్యను మందలించి కలహం ఆపివేయాలి. తర్వాత తమ్మునితో ఏకాంతంగా ఇలా చెప్పాలి. "తమ్ముడూ! వదిన నీకు తల్లితో సమానము. తల్లిని ఎదిరించడం తప్పు కదా? ఆమె వయస్సులో నీకంటే చిన్నదైనప్పటికిని నాకు భార్య కావడంవలన నీకు గౌరవనీయురాలే. నాకంటే ఆమెనే ఎక్కువ గౌరవించాలి. ఎలాగూ నాకు ప్రియమైన తమ్ముడివి కాబట్టి నన్ను గౌరవించకపోయినా అంతగా నేను బాధపడను. కాని ఆమె పరాయి ఇంటినుండి వచ్చింది. ఉన్నత స్థానములో ఉన్నది. కావున నా గురించైనా నీవు నీ వదినకు విధేయుడవై ఉండాలి. రామాయణంలో లక్ష్మణ భరత శత్రుఘ్నులు సీతను తల్లిలా ఎలా గౌరవించారో తెలుసు కదా! ఏదైనా విషయం ఉంటే నాకు చెప్పు. నీ గురించి నే నేదైనా త్యాగం చేయగలను. కాని వదినగారితో మాత్రం ఎప్పుడూ కలహించుకోరాదు."

భార్యకు కూడా ఇలా ఉపదేశించాలి. "హృదయేశ్వరీ! మరిది అంటే నీకు పుత్రునితో సమానం కదా! పుత్రునితో తల్లి కలహించుకుంటుందా? నీవు పుత్ర వాత్సల్యంతో వానిని చూడడంలేదు కాబట్టి అతనిలో మాతృభావం కలగడంలేదు. వాడు నీతో కలహించాడంటే అది నీదే తప్పు. పిల్లలు తప్పులు చేస్తే తల్లి క్షమించదా? నీవు కొన్ని తప్పులను క్షమించు. తప్పక వాడు నీకు విధేయుడౌతాడు. చేయకూడని తప్పులేవైనా చేస్తూ ఉంటే మంచి మాటలతో ఉపదేశించు. అప్పుడూ వినకపోతే నాకు చెప్పు. అంతేకాని నేరుగా కలహం పెట్టుకోకు. అది మనకే అవమానం. మనం ఆవేశంతో ఏమన్నా భరించగలడు కాని, వాడు ఆవేశంతో చెడుగా మాట్లాడితే భరించగలమా? ఆ స్థితికి మనం ఎప్పుడూ దిగజారకూడదు. మన గౌరవాన్ని, హుందాతనాన్ని జాగ్రత్తతో కాపాడుకోవాలి" అని భార్యతో మృదువుగా నచ్చచెప్పాలి.

**21. ప్రశ్న: తమ భార్యలు పరస్పరం తగువులాడుకుంటే అన్నదమ్ములేమి చేయాలి?**

**జవాబు:** భార్యల కలహాన్ని తమదాకా రానీయకుండా అన్నదమ్ములిద్దరూ జాగ్రత్త పడాలి. మొదట తమ తమ భార్యలను మందలించి కలహాన్ని ఆపాలి. ఏకాంతంలో ఎవరి భార్యకు వారు మంచి మాటలు చెప్పి మందలించాలి. తమ్ముడు తన భార్యతో "నీవు చాలా పొరపాటు చేస్తున్నావు. అన్న మనకు తండ్రితో సమానం. అన్నకు భార్య కావడం వలన వదిన కూడా మనకు తల్లితో సమానమే కదా! ప్రేమతో జయించాలి. కాని ద్వేషంతో పోట్లాడేవారికి ఓటమే లభిస్తుంది. పెద్దవారితో కలహించుకోవడంవల్ల పదిమందిలో చులకన అవుతాం" అని చెప్పాలి.

అన్న తన భార్యతో – "నా తమ్ముడు నీకు కొడుకుతో సమానం కాబట్టి అతని భార్య

కూడా నీకు కూతురులాంటిది. కూతురుతో ఎవరైనా పోట్లాడుతారా? ఆమె చేసే తప్పులను క్షమించడంవల్ల నీపట్ల ఆమెకు ప్రేమే పెరుగుతుంది. నీ స్థానం ఉన్నతమవుతుంది. కోపగించేవారు ఓడిపోతారు. కోపాన్ని ధైర్యంతో సహించేవారు జయిస్తారు. నీవు సంయమనంతో ఉండు" అని ప్రేమపూర్వకంగా తెలియబరచాలి.

అన్నదమ్ములిద్దరు కలిసి తమ తమ భార్యలను కూడా కూర్చోబెట్టుకుని ఈ విధంగా చర్చించాలి – "మనము బ్రతికినన్నిరోజులు కలిసి కష్టసుఖాలు పంచుకుంటూ అన్యోన్యంగా ఒక గూటి పక్షులలాగా, ఒకే చెట్టు రెమ్మలలాగా బ్రతుకుదాం. మనం ఐకమత్యంతో ఉంటే ఎంతో అభివృద్ధిని సాధిస్తాం. ఇరుగు పొరుగువారు కూడా మనలను చూసి భయపడతారు. మంచి నేర్చుకుంటారు. గౌరవిస్తారు. తప్పు చేయనివారెవరు? చిన్న చిన్న తప్పులకు మనం విడిపోతే వచ్చే లాభమేమిటి? మా గురించి మీరు మీ గురించి మేము ఒకరికొకరం త్యాగాలు చేసుకుంటూ బ్రతుకుదాం" అని చర్చించాలి. లాభం లేకపోతే నిత్యమూ పోట్లాడుటకంటే ప్రేమతో వేరుపడుట మేలు కదా! స్త్రీలలో ఓర్పు నశిస్తే వేరుగా ఉండడమే మంచిది. విడిపోయాక కూడా పరస్పరం పోట్లాడుకుంటే ఇక వేరుపడి ప్రయోజనమేమిటి? కాబట్టి ప్రేమకోసమే కలిసుండాలి. ప్రేమ కోసమే వేరు పడాలి. వేరు పడేటప్పుడు అన్న ఎంతిస్తే తమ్ముడు అంతే గ్రహించాలి. అన్న తన దృష్టితో తమ్మునికెక్కువ ఇవ్వాలి. వాడు చిన్నవాడు ప్రేమపాత్రుడు కాబట్టి. అన్న తనకెక్కువిచ్చినా తమ్ముడు సరిగా లేదనుకుంటే అన్న తమ్ముని ఉద్దేశ్యంనే ఆదరించాలి. మన్నించాలి. త్యాగమే గొప్పది. తుచ్ఛమైన వస్తువుల కోసం రాగద్వేషాలు చూపడం చాలా తప్పు.

**22.ప్రశ్న: కొడుకులు పరస్పరం పోట్లాడుకుంటే అన్నదమ్ములేమి చేయాలి?**

**జవాబు:** తమ కొడుకులు పరస్పరం పోట్లాడుకుంటే అన్నదమ్ములిరువురు తమ్ముని కొడుకు పక్షం అన్న, అన్నకొడుకు పక్షం తమ్ముడు మాట్లాడాలి. ఇద్దరినీ ఒకటయ్యే రీతిలో మందలించాలి. కొడుకులను కూర్చోబెట్టుకుని హితోక్తులు, ప్రేమ, ఐకమత్యంల గొప్పదనం తెలియజెయ్యాలి. "మమ్ములను ఆదర్శంగా తీసుకోండి. మావలెనే మీరు కూడా విడిపోకుండా సమిష్టిగా జీవితాంతం మెలగండి" అని ఇరువురితో ప్రేమ కలిగేటట్లు ఉపదేశించాలి. అన్నదమ్ములు ఎప్పుడు కూడా స్వంతకొడుకు పక్షం వహించకూడదు. అలా చేయడంవలన ఆ కలహం అన్నదమ్ములిరువురి మధ్యలోకి వస్తుంది. చివరికి చినికి చినికి గాలివానై ఆ కుటుంబంలో ఉప్పెన ఏర్పడుతుంది. కావున జాగ్రత్తగా ఇలాంటి సమస్యలను పరిష్కరించుకోవాలి. తమ తమ కొడుకులను వ్యక్తిగతంగా "నాయనా! మనది ఉమ్మడి కుటుంబం. మీ చిన్నపిల్లల పోట్లాటలవల్ల పెద్దముప్పే ఏర్పడుతుంది. మీ ద్వారా ఒక మహావృక్షం చీలిపోవలసి వస్తుంది. మనమంతా ఒక వృక్షపు శాఖలమే" అని ఎన్నో విధాలుగా ఉపదేశించాలి.



**23.ప్రశ్న: తల్లి–భార్య (అత్తాకోడళ్ళు) పోట్లాడుకుంటే పుత్రుడేమి చేయాలి?**

**జవాబు:** ఈ పరిస్థితి పుత్రునికో అగ్నిపరీక్ష. తల్లి పక్షాన మాట్లాడితే భార్య ఏడవడం మొదలుపెడుతుంది. భార్య పక్షాన మాట్లాడితే "వీడు భార్య మనిషైపోయాడు, దానికి దాసుడైనాడు, కన్నతల్లినైన నన్నే లెక్క చేయడంలేదు" అని దుఃఖితురాలవుతుంది. ఇలాంటి విషమ పరిస్థితిలో మొదట తల్లి పక్షం వహించి కలహ నివృత్తి చేయాలి. ఇద్దరికీ వేరు వేరుగా ఇలా చెప్పాలి.

భార్యతో – "సఖీ! బాధ పడకు. ఆ సమయంలో అమ్మపక్షమే వహించవలసి వచ్చింది. అలా చేయకపోతే ఆమె ఇంకా రెచ్చిపోతుంది. శాపనార్థాలు పెడుతుంది. ఏడుస్తుంది. కొడుకు నానుండి దూరమైనాడనీ ఆ మాయదారి కోడలు నా కొడుకును నాకు కాకుండా చేసిందని ఎన్నెన్నో ఊహిస్తుంది. బహిరంగం చేస్తుంది. కాబట్టి ఆమెను శాంతపరచడానికి ఆమె పక్షమే వహించవలసి వచ్చింది. అయినా అమ్మ మన హితం కోరేదే కదా! ఆమె కోరినంత చేసినంత ఉపకారం ఇంకెవ్వరైనా చేస్తారా? మనం బాగుపడాలనేదే ఆమె తాపత్రయం. బయటికి కఠినంగా మాట్లాడినప్పటికీ ఆంతర్యంలో నీపట్ల ఎంతో ప్రేమ ఉంది. నన్ను నీవు ప్రేమించదలచుకుంటే ముందు అమ్మను ప్రేమించు. లేకపోతే మనం లోకం దృష్టిలో చులకనైపోతాము. మన ఉన్నతి కొరకు మా తల్లిదండ్రులు ఎంతో కష్టపడి ఇదంతా సంపాదించి పెట్టారు కదా! పెద్దలు, యజమానులు, అయినవారు ఈ మాత్రం అధికారం చూపరా? నీవు తల్లిదండ్రి మొదలగువారిని విడిచి ఇక్కడికి వచ్చినదానివి నా తల్లిదండ్రులను నీ తల్లిదండ్రులుగా భావించలేవా? చూడు ఈ లోకంలో ఎంతటివారినైనా ప్రేమతో జయించవచ్చు. దానికున్న శక్తి దేనికీ లేదు. అమ్మ ఏమన్నా ఓ రెండు మూడుసార్లు మౌనం వహించు. తప్పకుండా ఆమెలో మార్పు వస్తుంది. ఇంకెన్నడూ నీ జోలికి రాదు. పైగా నిన్ను గొప్పగా చెప్పుకుంటుంది." ఇలా ఎన్నెన్నో హితపు మాటలు చెప్పి మనస్సును మార్చాలి. అంతేగాని కొట్టడం తిట్టడం ఎన్నటికీ చేయరాదు. స్త్రీని కొట్టే పురుషుడు ఒక పురుషుడేనా? ప్రతి ఒక్కరు ప్రేమతో సాధించలేనిది ఏదీ లేదని తెలుసుకోవాలి. "స్త్రీకి వశుడై ఆమె చెప్పుడు మాటల్లో పడి ఎవరితోనూ కలహం, తగువు, ద్వేషం పెట్టుకోరాదు. భార్య పక్షం వహించి తల్లిదండ్రులను సోదరీ సోదరులను తిరస్కరించడం, అవమానించడం చాలా పెద్ద తప్పు".

తల్లితో ఒంటరిగా – "అమ్మా! పాపం, ఆమెను క్షమించు. చిన్నది తెలియక ఏదో మాట్లాడింది. ఇంకోసారి ఇలా ప్రవర్తించకూడదని గట్టిగా బెదిరించి చెప్పాను. ఈమెకు నీవు తప్ప ఇంకెవ్వరున్నారు. తల్లిదండ్రినీ, అన్నాతమ్ముళ్ళనూ అందరినీ వదిలిపెట్టి వచ్చింది. వారందర్నీ మరిపించే శక్తి నీకొక్కదానికే ఉంది. ఆమె మంచి చెడులు నీవే కదా చూసేది. నీవామెను పరాయి స్త్రీలా భావించినందువల్లనే ఆమె నిన్ను తిరస్కరించి ఉండవచ్చు. నీవు

కూతురుతో సమానంగా చూస్తే తప్పకుండా నిన్ను తల్లికంటే ఎక్కువ చూస్తుంది. ఆదరిస్తుంది. సేవచేస్తుంది. ఒక్క చేయి కదిపితే ఎప్పుడూ చప్పుడు రాదు కదా! ఎందుకు చిన్నదానితో కలహించుకొని నీ స్థానాన్ని దిగజార్చుకుంటావు? పిల్లలు తప్పుచేస్తే పెద్దలు ప్రేమతో మంచి మాటలతో అలా ఇంకెప్పుడూ చేయరాదని చెప్పాలి. ఓ నాలుగుసార్లు అవకాశమివ్వాలి. అప్పుడు కూడా వినకపోతే సామ దాన భేద దండోపాయాలను ప్రయోగించాలి. అమ్మా! ఈమెను క్షమించు. నీ మనస్సును బాధపెట్టినా, వ్యతిరేకంగా ప్రవర్తించినా సహించి ఈమెను సన్మార్గురాలిని చేయి. నేను నీకు కొడుకునైనప్పుడు ఈమె నీకు కూతురుతో సమానం కాదా? నేను చిన్నతనంలో చాలాసార్లు నీ ఒడిలో మలమూత్రాలు వదలినా, ప్రేమతో, సంతోషంతో ఎంతో ఉపకారం చేశావు. ఎప్పుడూ కోపపడలేదు. ఏది చేసినా క్షమించి ఒడిలోకి తీసుకునే మహత్తరశక్తి నీకు ఉంది. ఈమెను నీ శరీర భాగంగానే భావించు. పొరపాటున పళ్ళతో నాలుకను కొరక్కుంటే వాటితో విరోధం, కోపం రానట్లే ఈమెవల్ల ఏదైనా పొరపాటు జరిగితే నీకు కోపం రాకూడదు. ఈమె నాకు అర్ధాంగి అవడం వల్ల నీ అవయవమే అవుతుంది.

తల్లి మరియు భార్యతో "మీరు ఒండొరులు పోట్లాడితే నే నెవరి పక్షం వహించాలి. వెనక బావి, ముందు చెరువు (ముందు నుయ్యి వెనుక గొయ్యి) అన్నట్లుగా ఉంది పరిస్థితి. ఇద్దరూ నాకు కావలసినవారే. ఇద్దరికీ నేను కావలసినవాణ్ణే. నా సుఖం మీరు కాంక్షిస్తే అన్యోన్యంగా ఉండండి. నేను కూడ మీ పట్ల పక్షపాతం చూపను. ఎందుకు మనం మన కుటుంబాన్ని స్వయంగా నరకంగా మార్చుకోవాలి? మనకేం తక్కువ ఉందని బాధపడాలి? మీరు అనవసరంగా చిన్న చిన్న వాటిని భూతద్దంలో చూసుకుంటూ గోటితో పోయేదాన్ని గొడ్డలిదాకా తీసుకురాకండి. గోరంతలు కొండంతలు చేయకండి. నన్ను మానసికంగా ఇబ్బందిపాలు చేయకండి. నా సుఖాన్నీ, శాంతినీ కోరేవారైతే మీరొకరి కొకరు త్యాగం చేయడం, ప్రేమించుకోవడం, గౌరవించుకోవడం నేర్చుకోండి" అని ఇద్దరికీ సమయోచితంగా నచ్చచెప్పాలి. ఇలా చేసినట్లయితే స్వర్గమెలాకాదు గృహం? స్వయంగా ఇలా చేసి చూడండి. మీ గృహం నిత్యవైభోగంతో తులతూగుతుంది.

**24.ప్రశ్న: తన భార్య కొడుకు భార్య (కోడలు) పోట్లాడుకుంటే అతడు ఏం చేయాలి?**

**జవాబు:** మొదట కోడలు పక్షం వహించి కలహాన్ని శాంతింపజేయాలి. వేరు వేరుగా ఒకరిమీద ఒకరికి గౌరవం, ప్రేమ కలిగే విధంగా ఉపదేశించాలి. భార్యతో "చూడు దేవీ! నీవెంత కాదనుకున్నా మన కొడుకుకు భార్య కావడంవలన మనకు కూతురుతో సమానమే. ఆమె తనవారందరినీ వదలి మనలనే నమ్ముకుని మన ఇంటికి వచ్చింది. ఆమె తన కష్టం నీతోకాక ఇంకెవరితో చెప్పుకుంటుంది? ఆమెకు ఆధారమైనా, ఆశ్రయమైనా నీవే కదా! ఈనాటి అత్త ఓనాటి కోడలనే సంగతిని మరిచిపోయావా? చిన్నదానితో కలహించడం వల్ల పెద్దవాళ్ళమైన



మనకే అవమానం కలుగుతుంది. ఆమెను బాధించి అవమానం పొందడంకంటే ప్రేమించి సుఖపడటం మంచిది కదా! అత్తామామలు ఇలాంటివారని లోకంతో ఎందుకనిపించుకోవాలి? మన వృద్ధాప్యంలో అన్నపానీయాలందించి సేవచేసేది కోడలే కదా! నిజానికి మనం కొడుకుకంటే కోడలునే ఎక్కువ ప్రేమించాలి. ఎందుకంటే కొడుకు సంపాదించి తెస్తాడే తప్ప అన్నపానీయాలు వండి వడ్డించడు కదా! ఇప్పుడు ఆమెను బాధలకు గురిచేస్తే మన వృద్ధాప్యంలో కసితీర్చుకుంటుంది. ఎవరైనా సమయం వచ్చినప్పుడే కదా బుద్ధి చెప్పేది. ఇంతవరకే "అత్త" అనుపదం లోకంలో చెడ్డ అభిప్రాయంతో స్థిరపడిపోయింది. కావున నీవు 'అత్త'లా గాకుండా 'తల్లి'లా ఆమెను లాలించి పాలించి ప్రేమించు. తప్పక ఆమెలో మార్పు వస్తుంది.

కోడలుతో "చూడమ్మా! అత్తమ్మ కోపించినదని బాధపడకు. నేనున్నాను కదా! నీకేమైనా బాధలుంటే చెప్పు. తండ్రిలా నీకెంతటి త్యాగాన్నైనా చేస్తాను. అత్త ఏది చేసినా కోడలు మంచికే చేస్తుందమ్మా! కొడుకు పుట్టినప్పటినుండి 'కోడలు వస్తుంది నేను చెప్పినట్లు విని సేవలు చేస్తుంది, మా ఇంటికి దీపమై కొత్త వెలుగునిస్తుంది, ఆడుకోవడానికి పాపలనిస్తుంది, వృద్ధాప్యంలో అండగా ఉంటుంది' అని ఎన్నో ఆశలు పెట్టుకుంటుంది. ఇలా ఆశలు పెట్టుకున్న అత్త కోడలికి అన్యాయం చేస్తుందా? మీ సుఖం కొరకేకదమ్మా నేను మీ అత్త కష్టపడి ఇదంతా చేసింది? మా శ్రమను, ఆశను, ఆశయాలను మీరు కూడా గుర్తించాలి కదా! ఎలాగూ నీవు నీవారినందరినీ విడిచి మా దగ్గరకు వచ్చావు. అత్తను ప్రేమతో, భక్తితో మార్చలేవా? భక్తితో కొలిస్తే దేవుడే భక్తుని పాదాల దగ్గరకు వస్తాడని ఎన్ని కథలు చదువలేదు? అనురాగంతో రాళ్ళను కూడా కరిగించవచ్చు. మీ అత్త నీవనుకున్నంత చెడ్డదేమీకాదు. ఆమె నీ గురించి, నీ మంచితనం గురించి నాకెన్నోసార్లు చెప్పింది. ఇతరులతోను అలాగే చెప్తుతుంది. నీముందు మెచ్చుకుంటే నీకు గర్వమొస్తుందని, అభిమానంతో చెప్పలేకపోతుంది. నీ పట్ల చాలా ప్రేమ ఉంది. అయినా ఆమె ఎన్నాళ్ళుంటుంది. ఈ ఇంటి యజమానురాలివి నీవే కదా! మీ రిద్దరు తగువులాడుకుంటే ఇతరులు నీదే తప్పంటారు. పెద్దలు పిన్నలు పోట్లాడితే పిన్నలదే తప్పన్నట్లు నీదే తప్పవుతుంది. కనుక అవన్నీ దృష్టిలో ఉంచుకుని నీ ప్రవర్తన మార్చుకో. నీ ప్రవర్తనలో ఏదో తప్పు కనిపిస్తున్నందువల్లనే ఆమె నిన్ను మందలిస్తున్నది. అది తెలుసుకోవాలి. అత్త కావాలని కఠినంగా ప్రవర్తించినా అత్తగారి కాళ్ళమీద పడి ఏడ్చి క్షమించమని కోరాలి. ఆమెలో చెప్పరానంత మార్పు వస్తుంది. తలదించుకుంటుంది. దేవుడిని భక్తుడే భక్తితో జయించాలి కాని, దేవుడే వచ్చి భక్తునికి లొంగిపోడు. అలా నీ అత్తను ఒక్కదాన్ని లొంగదీసుకుంటే ఈ కుటుంబం మొత్తం నీ చేతిలో ఉంటుంది. దీనితో మీఇద్దరికే కాక ఇంటికీ శోభ కలుగుతుంది. ఇల్లు సుఖశాంతులతో వర్ధిల్లుతుంది. ఇంట్లోని వారందరు సుఖపడాలన్నా, బాధపడాలన్నా

అంతా నీ చేతిలోనే ఉంది. నీవు చెడటంవల్ల ఇల్లు అశాంతమవుతుంది. బాగుపడటంవల్ల ఇల్లు స్వర్గమవుతుంది. పెద్దల మాట విను. ఉదయం సాయంత్రం అత్తమామలకు పాదాభివందనం చేసి ఆశీర్వాదం పొందు. అత్త ఏమి మాట్లాడినా ఆమె ఎదుట ఏమీ మాట్లాడకు. ఆమె శాంతించిన తరువాత నీ మనసులోని మాట శాంతంగా చెప్పు. ఆమె ఒప్పుకున్నా ఒప్పుకొనకపోయినా నీ తప్పేమీ ఉండదు."

అత్తాకోడళ్ళను కూర్చోబెట్టుకుని ఇలా చెప్పాలి. నేను ఈ ఇంటికి యజమానిని. నా కనుకూలంగా చెప్పుచేతలలో మీరు నడవాలి. ఏదైనా మంచి చెడులుంటే నాకే చెప్పాలి. మీలో మీరు తగువులాడటం నేను సహించను. కొడుకుకు తెలిస్తే ఎంత బాధ పడతాడు? మీకేం తక్కువైందని తగువులాడుతున్నారు? ఇలా చేస్తే మన ఇంటి పరువు ఏమవుతుంది? తండ్రి కొడుకులం కష్టపడి సంపాదిస్తుంటే మీరు కూర్చొని తింటూ ఇంటిపరువు రచ్చపాలు చేస్తున్నారా? పదిమందిలో మేమెలా తలెత్తుకొని తిరగాలి? ఇతరులకు న్యాయం ఎలా చెప్పాలి? అని నెమ్మదిగా వారిలో మార్పు వచ్చే శైలిలో ఇంకా చెప్పాలి. జరిగిందేదో జరిగింది. ఇప్పటికైనా అన్యోన్యంగా మసలుకోండి అని హుందాగా చెప్పాలి.

**25.ప్రశ్న: తల్లిదండ్రులు పరస్పరం పోట్లాడుకుంటే కొడుకేం చేయాలి?**

**జవాబు:** మొదట ఇద్దరినీ ప్రయత్నించి కలహం నుండి దూరం చేయాలి. సాధ్యమైనంత వరకు కొడుకు తల్లి పక్షం వహించాలి. కాని తండ్రికి తల్లి పక్షం వహిస్తున్నాడనే సంగతి తెలియనీయకుండా జాగ్రత్త పడాలి.

కొడుకు తల్లిదండ్రికి వేరు వేరుగా ఇలా విన్నవించాలి. "నాన్నగారూ! మీరు ఈ గృహానికి యజమానులు. పూజింపదగినవారు. మిమ్ములను ఆదర్శంగా తీసుకొనేగదా మేము నడిచేది. అమ్మ ఏమి చెప్పాలన్నా మీతోనే గదా చెప్పేది? మీరే పోట్లాడితే ఇంకెవరితో చెప్పుతుంది? ఇన్ని సంవత్సరాలుగాలేని వైరం ఇప్పుడెందుకు? మీరేదైనా శాసించాలనుకుంటే మమ్ములను శాసించండి. మీరు అన్నీ తెలిసినవారు. మీకేమి బోధించలేము. కేవలం గుర్తు చేస్తున్నామంతే. ఇన్ని సంవత్సరాలుగా కలిసి జీవించినా మీ మధ్య భేదాలు ఇంకా ఉన్నాయా? మీరు ప్రశాంతంగా ఉన్నప్పుడే కదా మేమందరం సుఖపడేది? మీరిలాగే పోట్లాడుతుంటే మాలో మీపై గౌరవము తగ్గుతుంటుంది. కావున దయచేసి కలహాలు మాని మాకు మార్గదర్శకులు కండి". తల్లితోను ఇలా ప్రార్థించాలి "అమ్మా! నాన్నకు సన్నిహితంగా ఉండి అన్ని సేవలు చేసేది నీవే. ఈ కుటుంబ సామ్రాజ్యానికి నీవే కదా రాజమాత, గృహమాతవు. నిన్ను ఆదర్శంగా తీసుకునే కదా మీ కోడలు నాపట్ల ప్రవర్తించేది? కావున దయచేసి నాగురించైనా మీరు ఆదర్శంగా ప్రశాంతంగా జీవించండి. మీ కేదైనా లోటు ఉంటే నాకు చెప్పండి. నామీద మీకన్ని విధాలా అధికారమున్నది. మీ సుఖానికి త్యాగం చేయడానికైనా సిద్ధంగా ఉన్నాను" అని చెప్పాలి.



**26.ప్రశ్న: అత్త బాధలు పెట్టినా భర్త పట్టించుకొనకపోతే భార్య ఏం చేయాలి?**

**జవాబు:** సమయం కొరకు చూడాలి. అత్త బాధలు పెడుతున్నప్పుడు భర్తగాని, మామగాని, మరదులుగాని ఏమి పట్టించుకొనకపోతే కొంత సహనం వహించాలి. అరచి అరచి ఆమెనే అలసిపోతుంది. ఆమె కలహించడానికి కారణమేమిటో తెలుసుకొని దాన్ని మరల చేయకుండునట్లు చూడాలి. అగ్నిలో ఆజ్యం పోసినట్లు ఆమె మాటకు మాట జవాబు ఇవ్వడంవల్ల రెచ్చిపోతుందే తప్ప ప్రయోజనమేమీ ఉండదు. అరచేవారికి మౌనంగా ఉండటమే ఔషధం. ఎదురు సమాధానం ఇవ్వడంవల్ల తన అహం దెబ్బతింటుందని భావించి సాధింపులు ప్రారంభిస్తుంది. తను అన్నవన్నీ మరచిపోతుంది. కోడలు అన్నవే జ్ఞాపకం పెట్టుకొని అందరికీ చెపుతుంది. నానా భీభత్సం, హంగామా చేస్తుంది. నిజానికి కలహం పుట్టేది అత్త దగ్గరనుండే. ఆమె అనవసరమైన ప్రతి చిన్న విషయంలోనూ కలిగించుకుంటుంది. చిన్నవాళ్ళకేమీ తెలియదనుకుంటుంది. పెద్దరికం చెలాయించాలనుకుంటుంది. చూసి చూసి కోడలు ఒక్కసారి ప్రతిఘటిస్తుంది. దాన్ని భరించలేక నానారకాలుగా ఊహించుకొని బాధపడుతుంది. ఇతరులను బాధపెడుతుంది. స్త్రీ పురుష భేదం లేకుండా ప్రతిఒక్కరు స్వంత భావాలతో స్వేచ్ఛగా జీవించాలనుకుంటారు. అవి సిద్ధించనప్పుడు ఆవేశం, ఆవేదన ప్రారంభమవుతుంది. తద్వారా కలహానికి రంగం సిద్ధమవుతుంది. కొన్ని కలహాలు మాటలతో శాంతించవు. ఏది ఏమైనప్పటికినీ సాధ్యమైనంత వరకు కోడలు తన సమయం కొరకు వేచి చూడాలి. కోడలును దాటి అత్త మాత్రం ఎక్కడికీ పోదు. తన అవసానదశలోనైనా కోడలు చేతిలోకి అత్త రావలసిందే. భర్త తన పక్షం వచ్చేంతవరకు అత్తతో ఎలాంటి జగడం పెట్టుకోరాదు. స్థానికబలం లేకుండా ఎవరు ఏది సాధించలేరు. కోడలు ఒక్క ఆత్మవిశ్వాసంతో ఉండాలి. ఎన్నటికైనా ఈ ఇంటికి యజమానురాలిని నేనే. ఆమె ప్రభావం ఉంది కావున అందరూ ఆమె మాటలే వింటున్నారు. నేనిప్పుడు కలహించుకుంటే జరిగేనష్టం నాకే అని చెవిటిదాని వలె కాలం గడుపుతూ వేచి ఉండాలి.

**27.ప్రశ్న: భర్త, మామగారు కలహించుకుంటే భార్య (కోడలు) ఏం చేయాలి?**

**జవాబు:** భర్త తండ్రిగారితో జగడమాడుతుంటే ప్రయత్నించి భర్తను దూరంగా తీసుకొని పోవాలి. అన్నపానీయాలందించి శాంతపరచాలి. అనుకూలమైన సమయం చూసుకొని భర్తకు ఇలా తెలియచెప్పాలి. "ఎంత తప్పున్నా, ఏం జరిగినా మామగారు ఈ ఇంటికి పెద్దదిక్కు. ఆయన చేయనిదే మనం ఇంతవారమయ్యామా? ఇక్కడున్నదంతా మీ నాన్నగారిదే కదా? మీ అమ్మగారిని కూడా మీ నాన్నగారే తెచ్చారు. ధనసంపదలు, భూమి, ఆస్తి, ఇల్లు మొదలగు వైభవమంతా మీ తండ్రిగారి స్వార్జితం, సంరక్షితమే గదా. నిన్ను పుట్టించి ఇంతదాకా పెంచి పోషించింది నీతో తిట్టించుకోవడానికేనా? వారు మనలను సంపాదించి పెట్టమనడంలేదు.

జాగ్రత్తగా పొదుపు చేసుకుంటూ కష్టపడి సంపాదిస్తూ సుఖపడండి అని మాత్రమే కోరుతున్నారు. మంచి మాటలు, తమకు మేలు కోరేవారి మాటలు మీకు రుచించవా? మీకు హితం చెప్పేంతటిదానను కాను. కాకపోతే మీరు నాపై చూపుతున్న ప్రేమను అదనుగా తీసుకొని చెప్పుతున్నానంతే. తప్పుంటే క్షమించండి. తండ్రి దైవంతో సమానం. తల్లి శాపం కంటే తండ్రి శాపం పెద్దదని పెద్దలంటుంటారు. వారితో శాపనార్థాలు పెట్టించుకోవడమెందుకు? వారి సేవచేసి మంచి ఆశీర్వాదాన్ని పొందుదాము. నన్ను నీవు తక్కువ చూసినా సరే మామగారిని గౌరవించు. మన యజమాని, దైవం అన్నీ ఆయనే. మనిద్దరం కలిసి వారి ఆగ్రహాన్ని దూరం చేసి సంతోషంగా ప్రసన్నులుగా ఉంచుదాం" అని భర్త మనసు కరిగి తండ్రి పాదాలమీద పడి క్షమాపణ కోరేవిధంగా ప్రేమతో ఎట్ల వీలైతే అట్ల భర్త మనస్సును మార్చాలి.

**28.ప్రశ్న: భర్త, పుత్రుడు పరస్పరం కలహించుకుంటే భార్య (తల్లి) ఏం చేయాలి?**

**జవాబు:** భార్య ఎల్లప్పుడు భర్త పక్షమే వహించాలి. కొడుకు ప్రయోజకుడయ్యాడని తన మంచి చెడులు కొడుకే చూసుకుంటాడని తలచి భర్తను కాదని కొడుకు పక్షం మాట్లాడకూడదు. ఇద్దరినీ వేరువేరుగా ఒకరిపై నొకరికి భక్తిశ్రద్ధలు కలిగేటట్లు మంచి మాటలు చెప్పాలి.

కొడుకుతో "బాబూ! మీ నాన్నగారు ఏం చెప్పినా వాస్తవానికాయన నీ గురించే చేస్తాడు. నీపై సర్వదా వాత్సల్యభావమే ఉంటుంది. కలలో కూడా కీడు చేయడు. ఆయన మాటలు నిన్ను బాధపెడితే వాటిని మనస్సులో ఉంచుకొనక నీ కర్తవ్యం నీవు చెయ్యి. మేము నీకు ఏంచేసినా చేయకపోయినా నిన్ను కనిపెంచి పెద్దచేసినందులకు నీపై పితౄఋణభారము ఉన్నది. దాన్ని తీర్చుటకు ప్రయత్నించు. నాకు ఏం చేశారు? అనికాకుండా నేను వారికేం చేస్తున్నాను?" అని ప్రశ్నించుకొని మెలుగు. ఇంటికి యజమాని ఆయనే. నన్ను నీవు గౌరవించకపోయినా అంతగా బాధపడను. కాని నాన్నగారు చాలా బాధపడతారు. మనకు ప్రత్యక్షదైవమైన మీ తండ్రిగారిని ఎల్లవేళలా సంతోషంగా, ప్రసన్నంగా ఉంచుదా"మని అనేక విధాలుగా కొడుకుకు బోధలు చేయాలి.

భర్తతోనూ ఇలా చెప్పాలి "చూడండి! పిల్లవాడిని చిన్నచిన్న వాటికి మాటిమాటికి మందలించడం బాగుండదు. వాడు మంచివాడుగా మారేటట్లు శిక్షణనివ్వాలి కాని, ప్రతిఘటించేటట్లు దండించగూడదు. వాడు అజ్ఞానంతో మాట్లాడినా, చేయి చేసుకున్నా మనకెంత అవమానం? చెప్పవలసినది చెప్పే తీరుగ చెప్పండి. వింటే సుఖపడతాడు వినకపోతే కష్టపడతాడు. ఒక వయసు వచ్చిన తరువాత పిల్లలను స్నేహితులవలెనే చూడాలి. మరీ ఈ కాలం పిల్లలు ఎక్కువ స్వేచ్ఛను కోరుతున్నారు. ఎంతచెప్పినా వారికి తోచిందే చేస్తారు కాని మనకు నచ్చినది చేయరు కదా? అనవసరంగా బాధపెట్టడం, బాధపడటం ఎందుకు?



వాడూ నాలుగుచోట్ల నాలుగు విషయాలు తెలుసుకుంటున్నాడు. తను ఎలా బాగుపడాలనుకున్నాడో దానికనుకూలంగా ఆచరణ చేస్తాడు. కొన్ని అనుభవంతోనే అర్థమవుతాయి. అతనికి ఇష్టంలేనివి చెప్పడం... ఇలా అన్నీ వ్యర్థమే. కావున వాని మనస్సును అర్థం చేసుకొని చెడుదారిన పడకుండా అతడు దేన్ని ఇష్టపడుతున్నాడో దానికి మనవంతు సహకారం ఇస్తే వాడు ఇంకా ఉత్సాహంతో ముందుకు సాగుతాడు! బాగుపడతాడు. మనపై భక్తిశ్రద్ధలు చూపుతాడు అని ఎన్నోవిధాలుగా తన భర్తను శాంతింపజేయాలి.

**29.ప్రశ్న: భార్య, కొడుకు కలహించుకుంటే భర్త (తండ్రి) ఏం చేయాలి?**

**జవాబు:** భార్య, కొడుకు కలహించుకుంటున్నప్పుడు అతడు భార్య పక్షమే వహించి కలహమును ఆపి ఇద్దరికీ వేరువేరుగా నచ్చచెప్పాలి.

కొడుకు "బాబూ! వేదాది శాస్త్రాలలోనూ, సృష్ట్యాదినుండి మహాత్ములు, గొప్పవాళ్ళందరూనూ తల్లికే మొదటిస్థానమునిచ్చారు. "మాతృదేవో భవ", "మాతృమాన్" అని చదువలేదా? తల్లే ప్రత్యక్ష దైవం. **"అమృతానికి అర్పణకు అసలు పేరు అమ్మ, ఈ లోకమనే గుడిచేరగ తొలివాకిలి అమ్మ"** అన్నపాట వినలేదా? ఆమె శక్తినీ, అందాన్నీ సమస్తము నీ పెంపకానికే ధారపోసింది. నీవు మలమూత్రాదులు ఒడిలోనే వదలినా, అమ్మా అని అరచినా ఎక్కడున్నా పరుగున వచ్చి నిన్ను గుండెలకు హత్తుకునేది. తల్లి చేసే సేవలు వర్ణించడానికి బ్రహ్మదేవునికి కూడా సాధ్యంకాదు. ప్రపంచములో అన్ని సంబంధాలకంటే మాతృ సంబంధం చాలా గొప్పనైనది. నీవు నీ భార్యకు లొంగిపోయో లేదా ఇతర కారణములవలననో మీ అమ్మ మనస్సును బాధపెట్టకు" అని అనేక కారణాలను ఉదాహరణాలను చూపుచు మనస్సు మార్చుకునేవిధంగా తెలియపరచాలి. అంతేకాని ఆవేశంతో అవమానించరాదు. ఆవేశంతో పొందేవి పగలు, శతృత్వాలు అనర్థాలు మాత్రమే.

భార్యతో "దేవి! తనయుడు తగువులాడినాడని బాధపడుతున్నావు? నీకు తోడుగా నేనున్నాను గదా! దుఃఖాన్ని వదిలి యథార్థాన్ని ఆలోచించు. చిన్నలు తప్పులు చేస్తారు. పెద్దలు వాటిని క్షమించినప్పుడే పెద్ద మనస్సు కలవారవుతారు. నీవు అతనికి జన్మనిచ్చావు. పాలిచ్చి పోషించావు. తనుమనోధనములు ధారపోశావు. మలమూత్రాదులు నీ ఒడిలోనే చేయగా ఆనందించావే తప్ప ఆగ్రహించలేదు కదా! ఎందుకీనాడు అతని ఎడల కఠినంగా ప్రవర్తిస్తున్నావ్. ఢిల్లీకి రాజైనా తల్లికి కొడుకే కదా! కొడుకు దుష్టుడైనా తల్లి దుష్టురాలు కాగలదా? **"కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి"** అని ఎన్నోవిధాలుగా బోధించి తల్లీకొడుకుల మధ్య మాతృభక్తి, పుత్ర వాత్సల్యము పునఃస్థాపితమౌనట్లు చేయవలెను.

**30.ప్రశ్న: కుటుంబంలో ప్రేమ, సుఖశాంతులు ఎలా ఉండాలి?**

**జవాబు:** "నేను, నాది" అను అహంకార మమకారాలు మనసులో కలిగినప్పుడే ఏ వ్యవస్థైనా

చెడిపోతుంది. కుటుంబ వ్యవస్థలోనూ అంతే. "మనది, మనము" అన్నభావన అందరిలో ఉన్నంతవరకు ఆ కుటుంబాన్ని దేవుడు కూడా వేరు చేయలేడు. ముఖ్యంగా కుటుంబంలో ఉన్న తల్లిదండ్రులు, అన్నదమ్ములు మొదలగువారందరు స్వార్థాన్నీ, అభిమానాన్నీ త్యాగం చేసినప్పుడే అది స్వర్గసీమలా వెలుగొందుతుంది. ఒకరి అభిప్రాయాలనింకొకరు గౌరవించుకుంటూ, తనకొరకు కాక తనవాళ్ళ సుఖం కొరకు జీవిస్తున్నానని అందరి మనస్సులోనూ కలగాలి. ప్రేమ త్యాగంగా మారాలి. అనురాగంగా మారకూడదు. రాగమున్నప్పుడే ద్వేషం కలుగుతుంది. కావున త్యాగమయ జీవితమే నిజమైన జీవితం. తను ప్రాణంతో జీవించడం జీవించడం కాదు. ఇతరుల హృదయంలో జీవించినవాడే నిజంగా జీవించినవాడగును. ప్రేమ విశాలమైంది. ఎంతమందికైనా పంచవచ్చు. అందరికీ ఆమోదయోగ్యమైనది. కాని ద్వేషం సంకుచితమైంది. వ్యాకోచమే జీవితం, సంకుచితమే మరణం. ప్రతి ఒక్కరూ తమ అస్తిత్వాన్ని కోరుకుంటారు. తన మీసం మెలెయ్యాలని, తనమాటే నెగ్గాలని, తన స్వార్థమే సిద్ధించాలని తహతహలాడుతుంటారు. ఇది ఇతరులకు ఇబ్బందికరంగా మారినప్పుడు కలహం, ద్వేషం కలగడం ప్రారంభమవుతుంది. కావున పెద్దమనస్సుతో మెలగవలసి ఉంటుంది.

కుటుంబం ఒక చిన్న సామ్రాజ్యం. ఇంటి యజమాని రాజు. ఎప్పటికప్పుడు అన్ని వ్యవస్థలను చక్కదిద్దుతూ ఉండాలి. అందరినీ ఓ కంటితో గమనిస్తూనే ఉండాలి. ఎక్కడెక్కడ కలహ కారణాలు మొలకెత్తుతుంటాయో వాటిని గమనించి వెంటనే వాటిని సమూలంగా పెరికివేయాలి. తప్పుచేసిన ప్రతి వారిని యథాయోగ్యంగా శిక్షించాలి. దండించడం, శిక్షించడం, శిక్షణ నివ్వడం పదింతల సద్గుణాలను కలిగించేదిగా ఉండాలి. శాసనంతో అందరినీ అనుశాసనంలో ఉంచాలి. అందరికీ సమానంగా సరియైన గుణపాఠం నేర్పుతూ ఉండాలి. లేకపోతే కుటుంబ సామ్రాజ్యంలో వర్గ పోరాటాలు ప్రారంభమవుతాయి. తమ తమ స్వంతరాజ్యాలను స్థాపించడానికి కూడా వెనుకాడరు. కావున గృహాధిపతియైనవాడు చక్రవర్తిలా వ్యవహరించి రాజ్యవిస్తరణనే చేయాలి కాని రాజ్యవిచ్ఛిన్నం చేయకూడదు. సామంతులు దండయాత్రలు చేయుటకు సన్నద్ధులవుతుంటే వీరోచితంగా పోరాడి కుటుంబ విద్రోహభావాలను తరిమివేయాలి. వారి వారి యోగ్యతలనుబట్టి పదవులను ఇవ్వాలి. ఎప్పటికప్పుడు తనిఖీ చేస్తూ ఉండాలి. గృహరాజు ఆదర్శంగా సమర్థునిగా దుష్టశిక్షణ, శిష్టరక్షణ గావించుచు సర్వైశ్వర్యాలతో, భోగభాగ్యాలతో తులతూగునట్లుగా, స్వర్ణయుగంలా, స్వర్గధామంలా సుఖశాంతులతో విరాజిల్లునట్లు పరిపాలించవలెను. సమర్థుడైన నావికుడే ఓడను సముద్రం ఒడ్డుకు చేర్చునట్లు ఈ సంసార సాగరమునుండి తన కుటుంబాన్ని సమర్థుడైనవాడే ఒడ్డుకు చేర్చగలడు.



**31. ప్రశ్న: తల్లిదండ్రులు, కొడుకులు, కూతుళ్ళు పరస్పరం ఎలా నడుచుకోవాలి?**

**జవాబు:** తల్లిదండ్రులు "ఈ కొడుకులు, కూతుళ్ళు మన ఇంట పుట్టినవారు. వీరే మన సంపత్తి. వీరికి ఇహపర సుఖాలు లభించేవిధంగా తీర్చిదిద్దుదాం. మనం మన సుఖశాంతులను వీరికోసం త్యాగం చేద్దాం. పుత్రుడు పుట్టినంతనే మనకు సంతోషం కలుగదు. అతడు పెరిగి పెద్దవాడై ప్రయోజకుడై పదిమందిలో మంచివాడైననాడే మనకు నిజమైన పుత్రోత్సాహము కలుగుతుంది. మన సంతాన నిర్మాణం కొరకు మన జీవితాలను పునాదులుగా వేద్దాం. మన సుఖమే ముఖ్యం కాదు. వాళ్ళను క్రమశిక్షణలో పెట్టాలి. మంచి విద్య నేర్పించాలి" అని పరిపరివిధాలా ఆలోచించాలి.

సంతానం కూడా ఇలా ఆలోచించాలి "ఈ శరీరం తల్లిదండ్రుల దయవలననే లభించింది. దీనితో మనం పరమాత్మను, మహదానందాన్ని పొందగలం. **"శరీరమాద్యం ఖలు ధర్మసాధనం"** ధర్మార్థ కామమోక్షాలు సాధించడానికి ఈ శరీరమే మొదటి సాధనం కదా! ఇలాంటి ధర్మసాధనమైన శరీరం మనకు ఇచ్చింది తల్లిదండ్రులే. మన జీవన సాఫల్యానికి గొప్ప ఉపకారం చేశారు. వీరి ఋణం ఎలా తీర్చుకోగలం? ఒకటి మాత్రం చేయగలం. వీరికి ఎప్పుడునూ దుఃఖం అశాంతి కలుగకుండా చూడాలి. వీరికి కీర్తి తీసుకురావాలి. మనవల్ల వీరికి ఈ లోకంలో గౌరవ సత్కారాలు కలగాలి. మనవల్ల ఎన్నడునూ అవమానం జరుగరాదు. వారిని వృద్ధాప్యంలో పసితనంలో మనలను పెంచినట్లుగా సేవలు చేద్దాం. ప్రత్యక్షదైవాలు తల్లిదండ్రులే కదా" అని భావించి ఆచరించాలి.

ఇలా ఒండొరులు ప్రవర్తించినప్పుడు ఒకరిమీద ఒకరికి ప్రేమ పెరుగుతుంది. ప్రేమయే జీవితం. ఆనందమే జీవిత మకరందం. మకరందం లేకపోతే పుష్పం గుర్తించబడనట్లు ప్రేమ లేకపోతే జీవితం వికసించదు. అమూల్యమైన ఈ మానవజన్మ మనకు వచ్చినందుకు దాని గొప్పతనాన్ని తెలుసుకొని, దేనికొరకు జన్మించామో దానికొరకు జీవిస్తూ జన్మను ధన్యం చేసుకోవాలి. అప్పుడే ఈ జన్మ సార్థకం. ఇది పరమార్థసాధకం.

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

## వైదిక వివాహవైశిష్ట్యం

ఈ సమస్తవిశ్వములో మొత్తం 84 లక్షల జీవరాసులున్నాయని చెబుతుంటారు. అందులో అన్నింటికంటే ప్రత్యేకమైనది, సర్వోత్కృష్టమైనది, ఈ విశ్వానికే పరిపూర్ణత చేకూర్చేది, సమస్త ప్రపంచమును తన మేధాశక్తితో ఉపయోగించుకునేది, శాసించేది ఈ మానవజీవి మాత్రమే. ఆహారము, నిద్ర, భయము, మైథునము మొదలగునవన్నీ సమస్త జీవరాశికి సమానమైనప్పటికిని ఒకే ఒక విశిష్టత మానవునికి అధికంగా ఉన్నది. ఆ విశిష్టత, ప్రత్యేకతవల్లనే ఈ సమస్త జీవరాశిని, విశ్వాన్ని ఉపయోగించుకొంటున్నాడు. ఆ సర్వోత్కృష్టమైన ప్రత్యేకతయే జ్ఞానము. ఆ జ్ఞానమే సమస్తజీవరాశినుండి మానవుణ్ణి వేరుచేస్తున్నది.

మానవుడు కర్మయోని. ఇతర జీవరాసులు భోగయోనులు. తమ పాపపుణ్యకర్మ ఫలములను భోగించుటకు జ్ఞానముతో పనిలేనందున అవి భోగయోనులయినాయి. మానవుడు అలాకాదు. ఈ సర్వోత్కృష్టమైన మానవ జీవితం ధర్మార్థకామమోక్షము లను చతుర్విధపురుషార్థాలను సాధించుటకు వచ్చింది. ధర్మపూర్వకంగా అర్థాన్ని సంపాదించి ధర్మపూర్వకంగా కామము (కోరిక)లను తీర్చుకుంటూ చరమ లక్ష్యమైన మోక్షాన్ని సాధించాలి. దీనికే జ్ఞాన మత్యవసరం. ఈ జ్ఞానాన్ని కలిగింపజేసేవే వేదాలు. అవి నాలుగు. 1.ఋగ్వేదం, 2. యజుర్వేదం, 3.సామవేదం, 4. అథర్వవేదం. మానవుడు సాధించవలసిన పురుషార్థాలూ నాలుగే. అవి: 1.ధర్మం, 2.అర్థం, 3.కామం, 4.మోక్షం. మానవుని జీవనవిధానం కూడా నాలుగు విధాలు. అవి - 1. బ్రహ్మచర్యం (25 సం॥రాల వరకు), 2.గృహస్థం (25 నుండి 50 సం॥ వరకు), 3.వానప్రస్థం (50 నుండి 75 వరకు), 4. సన్యాసం (75 నుండి మరణపర్యంతము).

మానవుడు పైన తెలిపిన నాలుగు ఆశ్రమముల జీవనమును గడుపుతూ, నాలుగు వేదాలసారాన్ని గ్రహించి, నాలుగు పురుషార్థాలను సాధించాలి. అందుకుగాను నాలుగు ఉపాయాలు కూడ శాస్త్రాలందున్నవి. 1.ఆగమం, 2.స్వాధ్యాయం, 3. ప్రవచనం, 4. వ్యవహారం, లేదా 1. శ్రోతవ్యం, 2. మంతవ్యం, 3. నిధిధ్యాసితవ్యం, 4.సాక్షాత్కర్తవ్యం. నాలుగేసి గలిగిన ఈ నాలుగింటి ద్వారా గడిపిన మానవజీవితము ధన్యం. ఈ నాల్గు నాల్గులు నిరంతరం విశ్వంలో మనగల్గవలయునన్న మానవుడు తన గుణకర్మ స్వభావాలకనువగు కన్యారత్నాన్ని వివాహమాడి గృహస్థాశ్రమజీవితాన్ని గడపాలి. మానవజీవితంలో గృహస్థాశ్రమం అన్ని ఆశ్రమాలకంటే శ్రేష్ఠమైంది, ముఖ్యమైందని శాస్త్రములందు చెప్పబడింది. ఆ ఆశ్రమం వివాహంతో ప్రారంభమౌతుంది.



### వివాహమంటే ఏమిటి?

వివాహం ఒక ఉత్తమోత్తమమైన ధార్మికసంబంధం. అది రెండు శబ్దాల కలయిక. 'వి' - అంటే విశేషమైన, 'వాహ' - అంటే యానం. విశిష్ట వాహనారోహణం వివాహం. వివాహమనే బండికి స్త్రీ పురుషులిరువురు రెండు చక్రాలు. రెంటికి సమానత్వం, సహవాసం, సద్గమనం అవసరం. వధూవరులు ప్రేమపూర్వకంగా ఆకర్షితులై తమ ఆత్మలను హృదయాలను, శరీరాలను పరస్పరం సమర్పణ చేసికోవాలి. దీనినే ప్రపంచభాషలో వివాహమంటారు. స్త్రీపురుషులు విశేషరీతిలో గృహస్థాశ్రమంలో ప్రవేశించి, సమానంగా బాధ్యలను నిర్వహించుటను వివాహమంటారు.

### వివాహసంస్కారమంటే ఏమిటి?

గృహస్థాశ్రమంలో ప్రవేశించు ప్రక్రియకే వివాహసంస్కారమని పేరు. మన శాస్త్రాల ననుసరించి ఈ సంస్కారము అత్యంత పవిత్రమగుటయే గాక గొప్ప మహత్వపూర్ణమైనది కూడ. వధూవరులిద్దరూ వైవాహికధర్మముల నెఱింగి ప్రవర్తించినచో వివాహంలోని గొప్పతనం వల్ల వారి కుటుంబ జీవనం ఆనందమయం కాగలదు.

వైదిక వివాహసంస్కారాన్ని, అందులో జరుగు మహోన్నత ఘట్టాలను పరిశీలించాలి. వధూవరులకిచ్చు శిక్షణ చాలా ఉన్నతంగా ఉంటుంది. వివాహ సమయంలో జరుపబడు ముఖ్య క్రియలు:-

1. వధువు మరియు ఆమె తల్లిదండ్రులు కలిసి వరునికి స్వాగతం పలుకుట, అర్ఘ్యపాద్యాసనాదులనిచ్చి సత్కరించుట, 2. మధుపర్కవిధితో ఉత్తమ పౌష్టికాహారాన్ని భుజింపజేయుట, 3. గోదానం, 4. కన్యాదానం, 5. ప్రధాన హోమం, రాష్ట్రభృత్, జయా, అభ్యాతన హోమాదులు, 6. పాణిగ్రహణం, 7. శిలారోహణం, 8. లాజా హోమం, 9.అగ్నిప్రదక్షిణ, 10. కేశవిమోచనం, 11. బ్రహ్మముడి, 12. సప్తపది, 13.జలమార్జనం, 14. సూర్యదర్శనం, 15. హృదయస్పర్శ, 16. ఆశీర్వాదం.

ఈ విధములగు క్రియలతో వివాహం వేదోక్తంగా జరుపబడుతుంది. ఈ క్రియలు వధూవరులకు ఎంతగానో గృహస్థజీవననిర్వహణాన్ని గూర్చి తెలుపగలవు. ఇంతియేగాక వధూవరు లిరువురూ పరస్పరం చేసుకొను ప్రమాణాలు ఇద్దరినీ ఒక్కటిగా బద్ధులను చేస్తున్నవి. ఇట్టి శిక్షణాపూర్వక వివాహంద్వారా దంపతులు స్వార్థరహిత ధార్మికజీవనం గడుపుతూ గృహస్థాశ్రమాన్ని భూతలస్వర్గంగా చేసుకోగలరు.

**'సప్తపది' (ఏడు అడుగులు - ఏడు ప్రతిజ్ఞలు)**

వైదిక వివాహంలో సప్తపదికి చాలా ప్రాధాన్యత ఉన్నది. స్త్రీపురుషులిరువురు కలిసి ఏడు అడుగులు నడిస్తేనే వివాహమైనట్లు లెక్క. ఇది లేకుండా పై క్రియ లెన్ని జరిగినా వివాహం కానట్లే కాబట్టి వైదికవివాహంలో వధూవరులను ఒక్కొక్క అడుగువేయిస్తూ ఒక్కొక్క ప్రతిజ్ఞను చేయిస్తారు.

| | | |
|---|---|---|
| మొదటి అడుగు | - | అన్న సంపాదనకొరకు |
| రెండవ అడుగు | - | బలసంపాదన కొరకు |
| మూడవ అడుగు | - | ధనసంపాదనకొరకు |
| నాల్గవ అడుగు | - | సుఖసంపాదనకొరకు |
| ఐదవ అడుగు | - | సంతానం కొరకు |
| ఆరవ అడుగు | - | దేశకాలపాత్రానుగుణ్యముగ నడచుకొనుటకొరకు |
| ఏడవ అడుగు | - | స్నేహంగా జీవించుటకొరకు |

ఇలా ఏడు అడుగుల నడకతో - ఏడు ప్రతిజ్ఞల మాటలతో ప్రారంభమైన ఈ నూతన వధూవరుల జీవన ప్రయాణం అగణిత అడుగులతో అనంత ఆనందమువైపు కొనసాగుతుంది. సుఖాలను పొందుతుంది.

## గృహస్థాశ్రమమే అన్నింటికి ఆధారం

గృహస్థాశ్రమం మిగిలిన ఆశ్రమాలన్నిటికీ తలమానికం వంటిది. శరీరభాగాలకు శిరస్సు ప్రధానమైనట్లు మిగిలిన ఆశ్రమాలవారికి గృహస్థాశ్రమం ఆధారమైయున్నది.

**యథా వాయుం సమాశ్రిత్య వర్తంతే సర్వజంతవః ।**
**తథా గృహస్థమాశ్రిత్య వర్తంతే సర్వ ఆశ్రమాః ॥** - మనుస్మృతి. 3-77

**భావం:-** ఏ విధంగా వాయువు ఆధారంగా సర్వజీవులు జీవనం గడుపుచున్నవో అదే విధంగా బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్యాసాశ్రమ వాసులందరూ గృహస్థుల పైనే ఆధారపడి జీవిస్తున్నారు. ఎట్లా నదులన్నీ సముద్రాన్నీ చేరుతాయో, అట్లే మిగతా ఆశ్రమాలన్నీ గృహస్థాశ్రమాన్నే చేరుతాయి. ఈ ధర్మాన్ని తెలుసుకొని వధూవరులు వివాహబంధంద్వారా దంపతులుకావాలి. ఇహపర లోకాలను చక్కబరచుటకు గొప్ప సాధనమైన గృహస్థాశ్రమాన్ని చక్కగా నిర్వహించాలి.

వివాహసమయంలో వధూవరుల మనోభావన ఇలా ఉండాలి

**ఓమ్ సమఞ్జన్తు విశ్వేదేవాః సమాపో హృదయాని నౌ ।**
**సం మాతరిశ్వా సం ధాతా సము దేష్ట్రీ దధాతు నౌ ॥** ఋగ్వేదం 10-85-47.



**భావం:-** మేము సంతోషంగా గృహస్థాశ్రమంలో ప్రవేశిస్తున్నాము. మా యిద్దరి హృదయాలు నీళ్ళు నీళ్ళు కలసినట్లుగా కలసిపోవునుగాక! ప్రాణవాయువు అందరికి ప్రియమైనట్లు మేమిద్దరం ఒకరికొకరం ప్రియులమగుదుముగాక! పరమేశ్వరుడు సమస్త ప్రపంచాన్ని రక్షించునట్లు మేమును పరస్పరం రక్షకులమై ఉందుముగాక! మే మిరువురం పరస్పరం దృఢంగా ప్రేమించుకొందుము గాక! (ఇట్టి ప్రేమపూర్ణ భావంతో రెండు హృదయాలు కలవటమే వివాహం యొక్క ముఖ్యోద్దేశ్యం).

వడ్లగింజలను ఒకమడిలో పోసి మొక్కలుగా మొలిపించి మరొకమడిలో నాటినప్పుడు అధికంగా పండుతుంది. ఇదే విధంగా అమ్మాయిలకు తండ్రి కుటుంబంలో లాలన - పాలన జరుగుతుంది. అత్తగారింటికి వెళ్ళిన తరువాతే సంతతి ద్వారా వారి జీవితం ఫలించటం జరుగుతుంది.

వధూవరులను పొట్టు బియ్యంగా పోల్చినపుడు వధువు పొట్టుకాగా వరుడు బియ్యము వంటివాడు. పొట్టు బియ్యము రెండూ కలిసి ఉంటాయి. ఆ రెండు కలిసి ఉన్నంత వరకు రెంటికి రక్షణ ఉంటుంది. పొట్టు బియ్యమునుండి వేరైన తరువాత పొట్టుకు విలువలేదు. అనగా భార్యతో ఉన్నంత వరకే భార్యకు గౌరవముంటుంది. పొట్టుపోయిన తరువాత బియ్యము ఎంత ధర గలదైననూ ఉత్పాదకశక్తిని కోల్పోతుంది. అంకురం తయారుకాదు. కనుక సంతానాభిలాషులైన భార్యాభర్తలు ఒకరినొకరు విడనాడక ఆదరంగా, ప్రేమగా, స్నేహంగా చూచుకొనుచూ సంతానరూప ఉత్తమఫలాలను పొందుతూ గృహస్థజీవనం గడపాలి.

'హార్మోనియం' అను సంగీత వాద్యంలో నిపుణుడు కావాలంటే స, రి, గ, మ, ప, ద, ని' అను సప్తస్వరాల' ను వాయించుటలో నిపుణతను సాధించునట్లుగా గృహస్థజీవితమనే హార్మోనియములో విజయం సాధించాలంటే 'సప్తపది' ద్వారా తెలుపబడిన, "అన్న సంపాదన, శరీరబల సంపాదన, ధన సంపాదన, సుఖ సంపాదన, సంతానము, ఋతుకాలాభి గమనం, మిత్రత్వం" అను సప్తవిషయములను సాధించుటకై నిరంతరం పురుష ప్రయత్నం చేయాలి. అప్పుడే గృహస్థజీవనం సుఖమయమౌతుంది.

ఆశీర్వాదం. వివాహమంటపము నందున్న పెద్దలు వధూవరులను ప్రేమతో చూస్తూ వధువును **"సౌభాగ్యమస్తు"** అంటూ వరుడిని, **"శుభం భవతు"** అంటూ ఆశీర్వదించాలి. పెద్దల ఆశీర్వాదబలంతో దంపతుల వైవాహికజీవనం ఉత్సాహభరితంగా, ఆనంద దాయకంగా ఉంటుంది. వారి గృహస్థాశ్రమం సార్థకమౌతుంది.

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

## డా॥ మట్టి కృష్ణారెడ్డి గారు తెలుగులో ముద్రించిన నాలుగు వేదాలు-వేద భాష్యాలు




## ముద్రిత వేదసాహిత్యం

దివ్యవేదవాణి రూ.24,000/-

వేదభగవాన్ (దేవనాగరి లిపిలో)
Size-15" x 20" వెల :రూ.5000/-

చతుర్వేద సంహిత-పుటలు: 4000
(7వ ముద్రణ) వెల: రూ.2500/-

ఋగ్వేద భాష్యమ్
పుటలు: 11,000; సంపుటాలు: 22, వెల: రూ.9000/-

యజుర్వేద భాష్యమ్
పుటలు: 3000; సం:6, వెల:రూ.2000/-

సామవేద భాష్యమ్
పుటలు: 3000; సం:6, వెల:రూ.2000/-

అథర్వవేద భాష్యమ్
పుటలు: 4000; సం:8, వెల: రూ.2500/-

వేదముల యథార్థ స్వరూపం
పుటలు: 500; వెల: రూ.400/-

శ్రీమద్దయానంద ప్రకాశం
పుటలు: 600; వెల: రూ.400/-

సత్యార్థ ప్రకాశం (సరళభాషలో)
పుటలు: 700; వెల: రూ.600/-

ఋగ్వేద సంహిత
పుటలు:1,600; సం:2 వెల:రూ.2000/-

యజుర్వేద సంహిత
పుటలు: 300; వెల: రూ.500/-

సామవేద సంహిత
పుటలు: 300; వెల: రూ.500/-

అథర్వవేద సంహిత
పుటలు: 700; వెల: రూ.1000/-

వేదాలలో గృహస్థాశ్రమ ధర్మాలు
వెల: రూ.100/-

వైదిక సిద్ధాంతం- వెల: రూ.50/-

వైదికసిద్ధాంతపరిచయం-వెల: రూ.50/-

కని-పెంచే తల్లిదండ్రులే
కనిపించే దేవతలు-వెల: రూ.20/-

సంప్రదించుటకు: **వేదధర్మ ప్రచార ట్రస్టు** (రి.)
2-127, ఆర్య సమాజం, బాదం కాంప్లెక్స్, చైతన్యపురి క్రాస్ రోడ్డు, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్-60. ఫోన్: 9441200322, 9849583929

**వరుడి తల్లిదండ్రులు**



**శ్రీమతి & శ్రీ గూడూరు సుధీర - రాజగోపాల్ రెడ్డి**

**వధువు తల్లిదండ్రులు**



కీ.శే. శ్రీ జి. పుల్లా రెడ్డి - నారాయణమ్మ గార్ల
దివ్య ఆశీస్సులతో...



కీ.శే. శ్రీమతి పాలగిరి లక్ష్మమ్మ - వెంకట్ రెడ్డి గార్ల
దివ్య ఆశీస్సులతో...



పాలగిరి సుబ్బారెడ్డి, సహదేవ రెడ్డి గార్ల తల్లిదండ్రులు